# జయంతి

# 5

సం. ౧ సం. ౫ మార్చి, ౧౯౫౯

ఈ సంచికలో

# జయంతి

# 5

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.






సంవత్సర చందా ౮-౦
విడిప్రతి ౭౫ న. పై.

హసజ, రాంషా

## గురజాడ అకవి?

జనవరి "జయంతి"లో గురజాడ అకవి అంటూ శ్రీ పొట్లపల్లి సీతారామరావు సెలవిచ్చారు. అదెంతవరకు సరిగావుందో చూద్దాం.

గురజాడ కవితాశక్తిని కొలచటానికి విమర్శకులు తీసుకొన్న కొలబద్దల బాగోగులను, వాటిని విమర్శకులు ఎంతవరకు సరిగా విమర్శలో ప్రయోగించారో అనే విషయాన్ని ముందు పరిశీలిద్దాం. వారి వాదనలలోని పరస్పర విరుద్ధ భావాలను గోచరం చేశాక, గురజాడలోని కవిత్వపు జాడ కేసి తిరుగుదాం.

విమర్శకు ఎలా పూనుకోవలసిందీ విమర్శకులు ఇలా చెప్పారు.

"కవిని విమర్శించునపుడు విమర్శకుడు ప్రధానముగా పేర్కొనవలసినది ఆయన కవితాశక్తి. అంతేకాని ఆయనలోని రాజకీయ తంత్రము—తాత్త్విక దార్శనికత్వము—మతేవో ఇతర విషయములు కావు. ఇవి యున్నవి కావున కవియనుట విమర్శయగునా? ఆధునిక విమర్శలో ఎక్కువ భాగమీ దోషముచే దూషితమై యున్నది. కవిని కవితాశక్తిని బట్టియే కవిగా నంగీకరింప వలయును. గురజాడ అప్పారావుగారు కవితాదృష్ట్యా పరిశీలించినచో నిలువరు."

కాబట్టి కవియొక్క హృదయస్పందం, దర్శనం కవితకు ముఖ్యం కావు. చెప్పదలచుకున్న దానిని అవతలవాడి గుండెను ఆకట్టేటుగా చెప్పగలగటం మాత్రమే ముఖ్యం. అట్టిశక్తి ఉన్నవాడు కవి. దర్శనం ఎంతగావున్నా, దానికి ప్రకటనాశక్తి సరిగా లేకపోతే, అది కవిత్వం కిందకు రాదంటే పేచీలేదు. కాని ప్రకటనాశక్తే కవి నిర్ణయానికి ఏకైక ప్రమాణం అవటం అతివాదం. ఎందుకంటే స్పందం, దర్శనం సరిగాగాని అసలేగాని లేని రచనలో ప్రకటనాశక్తి ఎంతవున్నా అదీ కవిత్వం కిందకురాదు. ప్రకటించటానికి అసలు ఏదైనా వుంటేనేకదా. దానికి హృదయాన్ని ఆకట్టే భావనాశక్తిని, భాషాశక్తిని జోడించటం లేకపోతే అది కేవలం శబ్ద ధ్వనులతో ఉపమానాలతో సాగించే సర్కస్ మాత్రమే అవుతుంది. అయితే ప్రకటించటానికి ఏమీ లేకుండా రచన చేయటం అనేదీ అసాధ్యమే. ఎందుకంటే అది శబ్ద తత్వానికే, భాషా తత్వానికే విరుద్ధం. కాకపోతే చెప్పదలచుకొన్నది అంతంత మాత్రపుదేనని దీని అర్థం. శూన్యంలోంచి రాలేదు శబ్దం. జ్ఞానం దానికి జనని. కాబట్టి కవికున్న జ్ఞానం అదెంతటిదైనా—అలాగే భావనాశక్తి, భాషా సంపత్తి ఈమూడు సమపాకంలో పడితేగాని అది కావ్యంకాదు. ఇదేదో నీనా ప్రజ్ఞకాదు. శబ్ద తత్వమే ఇది. భాష చరిత్రే ఇది. హృదయాన్ని రసంతో ఉత్తేజితం చేస్తున్న కవితాశక్తి స్వరూపమే ఇది. దీనినే ఇంకొక విధంగా కూడా చెప్పవచ్చును. ప్రకటనాశక్తి సన్నగిలినచోట నిశితంగా పరిశీలిస్తే దర్శనంకూడా సరిగా, నిండుగా, (కవిత్వరతిలో) వుండవలసినతీరుగా లేదని తెలుస్తుంది. ఈ రెండు ఏకమై వుంటవి. దర్శనం, వర్ణన రెండూ రచనలో, వాక్యంలో, పదంలో పద్యంలో, గేయంలో పెనవేసుకొని వుంటవి.

వర్ణన అంటే ఏమిటి? కలిగిన దర్శనాన్ని భావనతో, భాషతో వర్ణించటం. ఇదే కవిత్వం. వర్ణనశక్తి సరిగాలేదంటే, దానికర్థం దర్శనాన్ని సరిగా, స్ఫుటంగా వెలికి తీసుకురాలేకపోవటం. సరిగా ప్రకటించలేకపోవటం. వర్ణనశక్తిని గురించిన విమర్శకు ప్రాతిపదిక దర్శనం. తర్వాతనే ఇతర విషయాలు. కవి తన దర్శనాన్ని వ్యక్తం చేసుకోటంలో, దాని సాధనలకు పదును పెట్టాలి.

ఇక్కడ ఒక్కమాట: ఈ దర్శనం అంతర్హితంగా, స్వతస్సిద్ధంగా అవిచ్ఛిన్నమైనట్టిది. భేదరహితమైనట్టిది. ఉనికిని ఏకంగానేకాక, కవికి తన్మయత్వం కలిగించేదిగా చూపిస్తుంది. దర్శనం, సత్యం, జ్ఞానం, సౌందర్యం, ఆనందం ఇవన్నీ సమైక్యంగా దర్శనంలో సాక్షాత్కరిస్తవి. ఈ జీవితం, జగత్, చైతన్యం భ్రాంతికావని, సత్యమని, గ్రుడ్డివి కావని జ్ఞానమయమని, కురూపికావని, సౌందర్యమయమని, దుఃఖబద్ధంకావని, ఆనందమయమని, దర్శనంలో స్ఫురిస్తుంది. అయితే భ్రాంతి, అజ్ఞానం, కురూపితనం, దుఃఖం లేవనికాదు. సృష్టితత్వంలో ఇవి మూలాంశాలుకావు. ఇది నశించిపోకతప్పదు. నిలిచే శాశ్వతాంశాలు సత్యం, జ్ఞానం, సౌందర్యం, ఆనందం. వీటన్నిటి సమైక్య అనుభూతిరసం. ఇట్టి నిండుతనాన్ని కవి ముందుగా రసస్ఫూర్తిలో అనుభ

విస్తాడు కాబట్టి దాని ప్రకటనలో కూడా ఈ సమైక్యాను భూతి సరిగా ప్రస్ఫుటంచేస్తాడు. చేయాలి. అనగా అతడు చెప్పేది సత్యముఖ్యమై వుంటుంది. జ్ఞానపరంగా వుంటుంది. సౌందర్యభరితంగా వుంటుంది. ఆనందమయంగావుంటుంది. (ఆనందమంటే, దుఃఖాని కెప్పటికైనా తప్పదు అపజయం అని అతఃపూర్వపు జ్ఞానంవల్ల అనుభవమయ్యే పరమస్థాయి-అయితేగాని ఉల్లాసపరచే ఉద్రేకంకాదు.)

దర్శనంలో హృదయానికి కల్గిన ఈ పరిణామం ఫలితంగా, కవి ప్రకటనసాధనమైన భాషలోకూడా ఈ అనుభూతిని చొప్పించుకొనటానికి ప్రయత్నిస్తాడు. శబ్దాలు సరిగా పడాలి. అపార్థాలకు, అస్పష్టార్థాలకు దారితీయకూడదు ఇది సత్యానికి, జ్ఞానానికి సంబంధించినట్టిది. తర్వాత సౌందర్యాంశాన్ని, ఆనందాంశాన్ని చొప్పించాలి. కూర్పు శబ్దంగా చెవికి, అర్థంగా బుద్ధికి, భావనగా హృదయానికి ఇంపుగానూ, ఉత్తేజకరంగానూ వుండాలి. (అసలు లోపలి అనుభూతి ఇట్టిదే. కవికి దర్శనం సిద్ధించినప్పుడు, హృదయం ఒక్కటేకాదు, అతని మిగతా అంశాలన్నీకూడా స్తిమితపడి ఐక్యానుభూతిని అనుభవిస్తవి.) కవిత్వపు నిజభాష భావన. భావనే ప్రాణం. కాబట్టి శబ్దార్థాలకు ప్రాణప్రదమైన భావన శబ్దార్థాల్లోంచి అవతల గుండెలోకి దూసుకుపోతుంది, అంతే కాదు. (ఇదే ముఖ్యం)-

అవతల హృదయంలోకూడా కవికి ఆదిలో కలిగిన సమైక్యానుభూతిని, రూపు నిండుతనాన్ని కలిగించాలి రచన. పదలాలిత్యం, అలంకారం మిగతావన్నీ వున్నా, వాటిని శాసించి వినియోగించుకునే సరైన భావనాశక్తికనక లేకపోతే కవి స్వధర్మాన్ని నెరవేర్చలేనివాడవుతాడు. అంటే వినటానికి, బుద్ధికి ఇంపుగా వున్నంతమాత్రాన చాలదు. అవతల హృదయస్పందంలో కవి హృదయస్పందం ప్రతిధ్వనించాలి. కాబట్టి కవి శబ్దార్థాల విషయంలోనేగాక, ముఖ్యంగా భావన విషయంలో జవసత్వాలను ప్రదర్శించాలి. బలీయమైన భావన తగిన శబ్దార్థాల అలంకారాలతో పాఠకుడి హృదయంలో ప్రవేశించి, దానిని లోబరచుకొని, అతనిని అస్తిమితం చేస్తున్న ఇతర విషయాలను వెనక్కు నెట్టేసి, కవి దర్శనానికి పట్టాభిషేకం చేయిస్తుంది. దేనికి? పాఠకుడి హృదయంకూడా కవి హృదయంలా కట్టుకోటానికి - జగత్తు రాపిడిలో మరి దర్శనంతో పునీతమైన కవిహృదయం నిజానికి ఒకవిధంగా జగత్తు హృదయమే—తత్వంబట్టి; మధ్యలో ఎన్ని లోపాలున్నప్పటికి ప్రతివాడిగుండె జగత్తు హృదయం లాగానే కట్టుకుంటే ఇంకేంకావాలి? ఇదే విశ్వశ్రేయస్సు.

కాబట్టి కేవలం అభిప్రాయములబట్టి కవి అని అనటం ఎలా పొరబాటో, అలాగే కేవలం ప్రకటనాశక్తిబట్టి కవి అని అనటంకూడా పొరబాటు కవితాశక్తి అంటే కేవలం ప్రకటనాశక్తి మాత్రమే అని అనుకొనటం కవిత - తత్వాన్ని సరిగా అర్థంచేసుకోకపోవటమే కవితాశక్తి అంటే, జగత్తు, జీవితం వీటితత్వాన్ని కనిపెట్టటం. సంఘ గమనాన్ని, మానవ చైతన్యాన్ని నడుపుతున్న అంశాలను పసిగట్టటం, జీవనదిజాలు కనిపెట్టటం. జగత్-స్పందానికి అనుగుణంగా స్పందించటం. దీనికంతకూ కీలకం హృదయం ఎందుకంటే బైటి జగత్తులోటి మనుష్యులు వీరికి. కవికి కూడలి, కేంద్ర హృదయం ఇచ్ఛ అనేది వుండేది హృదయంలో జీవితం అంటె సవాలక్ష ఇచ్ఛలరాపిడి. స్వంత ఆరాటాలను, మమతలను, ద్వేషాలను నెట్టేసి, హృదయాన్ని స్వచ్ఛంగా, స్వచ్ఛందంగా స్పందించనిస్తే, అప్పుడే దాని స్పందం సరిగా ఉంటుంది. అటి స్పందం స్వార్థరహితంగా ఉంటుందని అందరి జీవితాన్ని ఏకంగా ఎంచుతుందని, కాలదేశ జాతి భేదాలను అతిక్రమించి మానవజాతి యావత్తుకు, అంతేకాదు సకలజగత్తుకూ కూడ ఏక హృదయస్పందంగా ఉంటుందని కవి గ్రహిస్తాడు అనుభవిస్తాడు వివిధంగా, భేదవిభేదాలతో జన్మేతే మానవులందరూ తత్వంబట్టి ఒక్కటే అని, ఇట్టి ఐక్య - స్పందంతో ప్రతివాడిగుండె కట్టుకోవాలని కవి కవిత్వంలో చెప్పుతాడు (అయితే దీనిని తార్కికభాషలో, కర్త కర్మ క్రియ భాషలో చెప్పడు) అందుకే కవి దేనికేసి చూసినా, దానితో ఏకమై, దానితత్వాన్ని అనుభవిస్తాడు.

ఈ ఐక్యానుభూతి అతనికి హృదయస్పందంలో సిద్ధించింది. ప్రత్యక్షంగా వున్న మానవ బాంధవ్యాల్లో స్ఫురిస్తుంది. కవి ఈ సత్యాన్ని భావాలద్వారా గోచరం చేస్తాడు. అనగా మానవహృదయాలను స్పందింపజేస్తున్నది ఈ యథార్థమే కాబట్టి, దానిని హృదయస్పందాలద్వారానే, భావాలద్వారానే కవి గోచరం చేస్తాడు క్షణక్షణానుభవాల్లోనే నిత్యసత్యం ఎలా నివురుగప్పిన నిప్పులావుందో హృదయాన్ని రగిల్చి చూపిస్తాడు.

ఇదే సారాంశం క్రాంత దర్శినులు, ఋషులు కానివారు కావ్యాలు వ్రాయలేరని చెప్పే సూక్తులకు.

కాబట్టి కవితాశక్తి అంటె దర్శనశక్తి, వర్ణనశక్తి రెండూ ఏకమైవున్నట్టిది అని తేలింది.

మరి విమర్శకులు రెండవదానినే ప్రధానంగా ఎంచటం సరిగాలేదు. అసలు వీరి ధోరణిలో పరస్పర విరుద్ధాలుగా వున్న భావాలు గోచరమౌతవి.

ఒక పక్కన కవితాశక్తియే, అనగా ప్రకటనాశక్తి, వర్ణనా శక్తియే తమ విమర్శకుల కొలబద్ద అని చెప్పుతూ, మరో పక్కన, "కవయః క్రాంతిదర్శనః" "నానృషిః కురుతే కావ్యమ్" అని అంటారు. మరి వారి దృష్టిలో వీటిని చర్చలోకి తేవటం కేవలం అనవసరమేకాక, దోషంకూడా నయ్యె.

అలాగే "రచయిత యభిప్రాయములలోని మంచి చెడుగులతో నాకు ప్రమేయములేదు. ఈ రచయితలో కవికి కావలసిన ప్రతిభయేలేదు." అని చెప్పి, "ఇందులో నేను విమర్శించినది రచయిత శక్తిని" అనికూడా ప్రకటించారు. లేదు. తమనియమాన్ని తామే ఉల్లంఘించారు విమర్శకులు.

ఇంత అరున్నర పేజీల విమర్శలోనూ నిజానికి విమర్శకులు గురజాడ అభిప్రాయములమీద ధ్వజమెత్తటంతోనే చాలావరకు సరిపోయింది. కవితా విమర్శ తక్కువై అభిప్రాయాల విమర్శన ఎక్కువైంది. అసలు విమర్శకులకు గురజాడ అభిప్రాయాలతోనే ఎక్కువ పేచీ ఉన్నట్లు కనబడుతుంది. ఉదాహరణలు—

"పరతంత్ర భావములేగాని స్వతంత్రభావములు—జాతీయ సంప్రదాయములు—ఈయనలో వంతగా కనుపించవు. కొన్ని యెడల సంప్రదాయములను వెక్కిరించుటకూడ కలదు."

"ఆంగ్ల ప్రభుత్వమువలన ఆంగ్లభాష వలన దేశములో నేర్పడిన కృతకసమాజముయొక్క అభిప్రాయములను కప్పుకొని కవి యనిపించుకొనుటకు ప్రయత్నించిన యొక వ్యక్తి—అంతే. అంతకంటె మించి ఆయనను గూర్చి చెప్పరాదు." కొందరకు సంస్కృతం విషయంలోలాగానే వీరికి ఆంగ్లం అంటే తేళ్ళు జెర్రెలు మీద పాకినట్లుంటుంది గావును; ఇదీ మన సాహిత్యదృష్టి!!

సంప్రదాయపు కొన్ని ఆచారాలనుగురించి గురజాడ చేసిన విమర్శను ప్రస్తావిస్తూ ఇలా అన్నారు :—

"వీనిని చదివినకొలది జాతీయభావము కలిగిన మన దేశీయులు చెప్పుచున్నట్లు కనిపించదు. స్వమత ప్రచారార్థము మిషనరీలు చెప్పు మాటలవలె కనిపించుచున్నవి." ఆచారాలను విమర్శిస్తే జాతీయతే లేనట్టు! వైద్యుడు శత్రువు!

కాబట్టి విమర్శకులు కవి, అకవి అని నిర్ణయించటానికి పెట్టుకొన్న ప్రమాణాలను సరిగా నిర్దేశించి వివరించలేకపోయారని; కవితా విషయాన్ని అదునుగా తీసుకొని, తమ ఆదర్శానికే విరుద్ధంగా అభిప్రాయాలమీదనే ధ్వజమెత్తటానికి పూనుకొన్నారని వారి రచనాధోరణే తెలియజేస్తుంది. అంటే ఎంతవద్దనుకున్నా కవితా విమర్శలో కవి అభిప్రాయాలతో కూడా ఎంతోకొంత ప్రసక్తికూడా వుంటుందని వారే ఒప్పుకోవలసివచ్చింది.

ఇక విమర్శకులు వేలెత్తిచూపిన లోపాలసంగతి వచ్చే సంచికలో మనవిచేస్తాను.

—హసజ.

# సాహిత్యమీమాంస

"కవులుగా కాలేనివారు విమర్శకులవుదురన్న చవుకబారు అభిప్రాయమొకటి వ్యాప్తమైయున్నది. ఇటువంటిదే విమర్శనముకంటె కవితాశక్తి గొప్పదను అభిప్రాయము" అన్నారు శాస్త్రిగారు.

ఈ చవుకబారు అభిప్రాయములను శాస్త్రిగారు అంగీకరించారా? లేక తిరస్కరించారా? అంటే తిరస్కరిద్దా మనుకునే అంగీకరించారు. ఎలాగ?

అక్కడే మరికొన్ని పంక్తులు కవి, విమర్శకుల వ్యాపారంలోని తారతమ్యాన్ని చెప్పి, ఆ తర్వాత "....విమర్శనా శక్తి కన్న కవితాశక్తి గొప్పది—నిజము. కవితాశక్తి గొప్పదే." అని చతికిల బడ్డారు.

కేవలం వాదంకోసం అలా అన్నారేమో? అందామా? కాదు. అసలు వాదమే కవితాశక్తి గొప్పదా, విమర్శనాశక్తి గొప్పదా అన్న ప్రశ్నపై ఆధారపడి వచ్చిన "విమర్శనముకంటె కవితాశక్తి గొప్పదను 'చవుకబారు' 'అవివేకమూల' అభిప్రాయంపై బయలుదేరిందికదా! అప్పుడు "నిజము, కవితాశక్తి గొప్పదే" అని చతికిలబడటం అదే చవుకబారు అవివేక మూలమైన అభిప్రాయాన్ని వ్యక్తీకరించడ మవుతుంది. అంగీకరించడమౌతుంది.

మరోరెండు వాక్యాలుకూడా ఉన్నాయి. నేను ఉదహరించిన వాక్యాలను అనుసరించే ఉన్నాయి. "....నిజము. కవితాశక్తి గొప్పదే. అయితే కవితాశక్తి కవులందరిలో ఒకే మోతాదులో లేదు. ఒకవిని మించిన శక్తిమంతు డింకొక డున్నాడు. అవాని మించుటకైన శక్తి ఎచటనుండి వచ్చినది? *విమర్శనమునుండి వచ్చినది. అతడు విమర్శకుడగుట వలన వచ్చినది. అందుకే మహాకవులందరునూ విమర్శకులని చెప్పుట.*"

పది తప్పుల్ని ఒక్క నోటితో ఖండించలేను. ఒక్కొక్కటే కానివ్వండి. కవులలో ఒకవినిమించిన శక్తిమంతు డింకొక డున్నాడనికదా వారన్నారు. కావచ్చును. నాకేమీ అభ్యంతరములేదు. అవాని మించుటకైన శక్తి ఎచటనుండి వచ్చినది? అన్న ప్రశ్నకు వారి జవాబు ఒక మహాపరాధమే, దాని పర్యవసానం మరో మహాపరాధం.

ఈసారి వివరిస్తాను. కవితాశక్తివేరు; విమర్శనాశక్తివేరు అన్న దృక్పథంతోనే ఈచర్చ ప్రారంభమైనది. ఈ రెండునూ ఒక్కటేనన్న అభిప్రాయంకూడా శాస్త్రిగారిదికాదు. నాదీ కాదు. శాస్త్రిగారిక్కడ 'అవాని మించుటకైన శక్తి ఎచ్చట నుండి వచ్చినది?' అని ప్రశ్నించుకుని "విమర్శనమునుండి వచ్చినది." అని అనాలోచితంగా జవాబు చెప్పటంలోనే పుట్టి మునిగింది.

ఎలాగంటే, ఈసారి మళ్ళీ మొదటికిరండి. అసలు చవుకబారు అభిప్రాయమిది:

1. 'విమర్శనాశక్తికన్న కవితాశక్తి గొప్పది.' అలాగే
2. 'కవితాశక్తికన్న విమర్శాశక్తి గొప్పది'.

రెండు అభిప్రాయాలనూ మొదటే శాస్త్రిగారు ఖండించారు. అందులో మొదటిదానిని శ్రీ శాస్త్రిగారు తర్వాత ఒప్పుకున్నారు. పైఅనాలోచితపు జవాబుతో రెండవదానిని కూడా వీరిప్పుడు ఒప్పుకున్నట్లు. ఒకనిమించిన కవి మరొకడు వున్నమాట నిజమే. ఆమించుటకైన శక్తి విమర్శవల్ల రాలేదు. వచ్చినదంటున్నారుకదా! అనగా కవులుగా ఆయిద్దరూ సమానమనీ, కొంచెం విమర్శకుడై ఉండటంవల్ల మొదటివానికన్న రెండవవాడు ఘనుడైనాడని కదా తాత్పర్యం? అనగా విమర్శాశక్తి కవితాశక్తికన్న గొప్పదని అంగీకరించట మయినదని అర్థం. ఇది రెండవ చవుకబారు అభిప్రాయం. ఆయిన ఈ క్రిందివాక్యమే దీనికి తార్కాణ. "....అందుకే మహాకవులందరునూ విమర్శకులని చెప్పుట...."

"అందువల్ల కవితావిమర్శనశక్తులలో ఏదిగొప్ప?" అన్న ప్రశ్న ఉదయింపదు. అవి రెండును అన్యోన్యమాధారాధేయములు" అని శాస్త్రిగారు మరికొద్దిదూరంలో అన్నారు. కనుక రెండిటినీ సమానముగా భావించారని అనుకోకూడదా? అంటే—

ఈ వ్యాసాన్ని వారు ఆలోచించి, ఆలోచించి సహేతుకమైన నిర్ణయాలకు వచ్చిన అనంతరం వ్రాయలేదు. ఊరికే ఉబుసుపోకకు ఆలోచిస్తూ వ్రాసుకుపోయారు. అందుకే పరస్పర విఘాతాలు ఈ వాక్యాలలో మనకు కనిపిస్తాయి.

ముందు విమర్శనాశక్తికన్న కవితాశక్తి గొప్పదను అభిప్రాయాన్ని చింపి పోగులుపెట్టారు. ఆతర్వాత కవితాశక్తికన్న విమర్శనాశక్తి గొప్పదను అభిప్రాయాన్ని చింపి పోగులుపెట్టారు. ఆతర్వాత మొదటిదాన్ని అతికి అదేగొప్ప అభిప్రాయమని శిరసావహించారు. ఆతర్వాత రెండవ అభిప్రాయాన్ని అతికి శిరసావహించారు. ఇప్పుడు ఈ రెండూ సమానమని మనకి చూపించి, బుజ్జగిస్తున్నారు. ఇది విమర్శకుడి వ్యాపారంకాదు. విమర్శకుడు కొన్ని అభిప్రాయాల్ని ఖండించి, మరికొన్నిటిని స్థాపిస్తాడు. ఈయన అన్ని అభిప్రాయాలనీ ఖండించి, వాటిని స్థాపించారు. ఇది గారడీవాడు చేసేపని. కవితా విమర్శనశక్తులు రెండు అన్యోన్యమాధారాధేయములని ఒప్పుకుంటే చాలు: ఏది ఎంతవరకూ దేనిమీద ఆధేయము? ఏది ఎంతవరకూ దేనికి ఆధారము అన్న ప్రశ్నలుపుట్టి మళ్ళీ కథ మొదటికివస్తోంది. అంటే ఈ రెండిటిలో 'ఏదిగొప్ప' అన్నప్రశ్న తిరిగి ఉదయించిందన్నమాటేగదా!

నిజానికి కవితాశక్తి వేరు; విమర్శనాశక్తి వేరు. వాటి స్వభావ, గుణ, వ్యాపారాలె వేరు. ఒకటి అమ్లజనివంటిది; రెండవది ఉదజని వంటిది. రెండూ స్వతంత్రాలే. ఉదజనివల్ల అమ్లజనికి జ్వలనశక్తి హెచ్చదు. రెండూకలిసి నీరవుతాయి. నీరు వేరు; ఉదజని వేరు; అమ్లజని వేరు.

మరో ప్రశ్న ఉంది. విమర్శకులలో ఒకనిని మించిన శక్తిమంతు డింకొకడున్నాడుకదా! ఆవాని మించుటకైన శక్తి ఎచటనుండి వచ్చినది? 'కవితాశక్తివలన వచ్చినది' అన్నచో ఆ సమాధానము ఇంత హాస్యాస్పదంగానూ ఉంటుంది. విమర్శకులలో వారి వారి అంతరములు విమర్శాశక్తిలో వారికున్న సమర్థతనుబట్టే ఏర్పడ్డవికాని మరోశక్తివల్ల కాదు.

అయితే కవితావిమర్శనశక్తులలో ఏదిగొప్పది? దేనికదే గొప్ప. కవుల విషయంలో కవితాశక్తి గొప్పది. విమర్శకుల విషయంలో విమర్శనాశక్తి గొప్పది. ఇద్దరు కవులలో ఒకరికన్న మరొకరు అధికులైనపుడు అట్టి ఆధిక్యతకు అధిక కవితాశక్తియే కారణం. అలాగే విమర్శకులలోకూడా అధిక విమర్శనాశక్తియే కారణం.

సాహిత్యశక్తి సంపన్నులయిన వారిలో కొందరు కేవల కవితాశక్తివల్లనే కవులవుతున్నారు. కేవల వస్తుగుణవిమర్శనాశక్తివల్లనే కొందరు విమర్శకు లవుతున్నారు. కావ్యశక్తీ, విమర్శనాశక్తీ యింతో అంతో వున్నవారుకూడా వున్నారు. వారు ఉభయు లవుతున్నారు.

'అట్టివాడు కారణజన్ముడు. అతడు సవ్యసాచి' అని శాస్త్రిగారంటున్నారు.

ఉభయు డవుతున్నా డన్నాను కదా! ఒకడు ఉభయుడయినంతమాత్రాన అతడు సవ్యసాచి కాడు. ఉదాహరణకి: ఒకడు కమ్మరి పనిలో నిపుణుడు; వాడు కమ్మరవుతున్నాడు. మరొకడు కుమ్మరి పనిలో నిపుణుడు. వాడు కుమ్మరి అవుతున్నాడు. ఒకడు ఉభయులలోనూ నిపుణుడు. వీరిలో ఎవరు గొప్ప? కమ్మరితనంలో ఉభయుని, కేవలకమ్మరితోపోల్చి

చెప్పండి. కుమ్మరి తనంలో ఉభయుని తీసుకొని కేవల కుమ్మరిలో పోల్చి చెప్పండి. కుమ్మరిపనిలోనూ, కమ్మరి పనిలోనూ ఇంతో అంతో ప్రవేశం వున్నదికనుక కుమ్మరిగా కేవల కుమ్మరి కన్నా, కమ్మరిగా కేవల కమ్మరికన్నా ఉభయుడు గొప్పవాడు కాజాలడు. అట్టివాడు 'Jack of all arts but master of none' ఏమో! అట్టివాడు సవ్యసాచి అవుతాడా? కాదు. కుమ్మరిపనిలో కేవల కుమ్మరికన్నా, కమ్మరి పనిలో కేవల కమ్మరికన్నా ఇతడు గొప్పవాడైతే ఆ ఉభయుని 'సవ్యసాచి' అనండి ఫరవాలేదు. అలాకాక, కమ్మరంలో కేవల కమ్మరికన్నా, కుమ్మరంలో కేవల కుమ్మరికన్నా హీనుడైతే ఉభయభ్రష్టుడని చెప్పండి. అదీ కాక, కమ్మరంలో కేవల కమ్మరికన్నా విద్యలో అల్పుడై, కుమ్మరంలో కేవల కుమ్మరులకన్న ఘనుడైనప్పుడు మహా కుమ్మరని చెప్పి, 'ఇతనికి కమ్మరము కూడా తెలియును' అని చెప్పాలి. ఇది విమర్శనాదృష్టి.

కుమ్మరిని కవి అనీ, కమ్మరిని విమర్శకుడనీ అనుకుంటే పైది సరిపోతుంది. కవి కానివాడు విమర్శకుడవుతున్నాడనో, విమర్శకుడు కానివాడు కవి అవుతున్నాడనో అనటం అశాస్త్రీయం. అది విమర్శకాదు. కవి కానిది గాడిద కావచ్చును; విమర్శకుడు కానివాడు మంగలి కావచ్చును. అది విచారణీయాంశం కాదు.

ముందు శాస్త్రిగారేమన్నారో జాగ్రత్తగా పరిశీలించండి: "నూటికి అరవైపాళ్ళు కవితాశక్తి గలిగి, నలభైపాళ్ళు విమర్శనాశక్తి గలవాడు మహాకవుల కోవలోని కెక్కునట్లు, అరవైపాళ్ళు విమర్శనాశక్తియు, నలభైపాళ్ళు కవితాశక్తియు గలవాడు విమర్శకుడవుతున్నాడు. ఒకప్పుడీ రెండునూ ఒకే వ్యక్తియందు సమపాళ్ళలో నుండవచ్చును. సవ్యసాచివలె అతడు రెండింటినీ ఉచితరీతిని నిర్వహించును. అట్టివాడు కారణజన్ముడు." అన్నారు కదా! ఇక్కడ సమపాళ్ళకు అర్థమేమిటి? నూటికి 50 పాళ్ళు కవితాశక్తియు, 50 పాళ్ళు విమర్శనాశక్తియు కలిగివుండుట అని అర్థం. కనుకనే అతను అపసవ్యసాచి.... నా సవ్యసాచే సవ్యసాచి.

నా సవ్యసాచికి కవితాశక్తి నూటికి నూరుపాళ్ళున్నది. విమర్శనాశక్తి నూటికి నూరుపాళ్ళున్నది. ఉభయ విద్యా ధురంధరుడవటంవల్ల నా సవ్యసాచి కవితాశక్తిలో నూటికి నూరుపాళ్ళుగల కేవల మహాకవికన్నా, విమర్శనాశక్తిలో నూటికి నూరుపాళ్ళుగల మహా విమర్శకునికన్న ఉభయుడవుటవల్ల 'సవ్యసాచి' అనే బిరుదాన్ని పొందదగినవాడయ్యాడు.

శాస్త్రిగారి సవ్యసాచి నా సవ్యసాచిముందు నూటికి 50 పాళ్ళు విమర్శనాశక్తినీ, 50 పాళ్ళు కవితాశక్తినీ మాత్రమే కలిగివుండటంవల్ల ఉభయభ్రష్టుడవుతున్నాడు.

కాని నా దృష్టిలో శాస్త్రిగారి 'పాళ్ళ'న్నీ 'పాడు' అనే శబ్దానికి బహువచనమే. వీటికీ కవిత్వానికీ ఏమీ సంబంధం లేదు. మన ప్రాచీన లాక్షణికులు నిర్దేశించిన సమస్త లక్షణాలే కవిత్వానికి అంశాలు. కావ్యవస్తువూ, కావ్యనాయకులు, కవి సమయాలు అన్న వాటిలో మాత్రమే మనకు వారిలో కొందరితో పేచీ. ఇక గుణాలు, అలంకారాలు, రీతి మొదలైన సమస్తాంశాల విషయంలోనూ వారితో ఏకీభవిస్తున్నాను. అయితే యిట్టి కవితాంశాలను ఇక్కడ వివరించటం సరికాదు.

T. S. ELIOT ఒకచోట "I do not intend from this the usually silly inference that the creative gift is *higher* than the critical. When one creative mind is better than another, the reason often is the better is more critical" (THE SACRED WOOD: Page xiv.) అన్నాడు. శాస్త్రిగారుకూడా "అయితే కవితాశక్తి కవులందరిలో ఒకే మోతాదులో లేదు. ఒకని మించిన శక్తిమంతుడొకడుగా నున్నాడు ఆ వాని మించుటకైన శక్తి ఎచటనుండి వచ్చినది? ఎట్లు వచ్చినది? అతడు విమర్శకుడగుటవలన వచ్చినది." అన్నారు.

శాస్త్రిగారుకూడా అదేవిధంగా అనలేదు. అదే అన్నారు. ఆ యింగ్లీషువాక్యాలకు సందర్భశుద్ధిలేని అనువాదమది.

విమర్శకుల్ని ఇలియట్ సంపూర్ణ (Perfect) విమర్శకులుగాను, అసంపూర్ణ (Imperfect) విమర్శకులుగాను పేర్కొని వ్రాసిన వ్యాసాలకు ఉపోద్ఘాతంలో ఈ వాక్యాలున్నాయి. సరిగా ఇదే వాక్యాలకుముందు ఇలియట్ "The criticism proper betrays such poverty of ideas and such atrophy of sensibility *that men who ought to preserve their critical ability for the improvement of their own creative work are tempted into* criticism." అని అన్నాడు. ఆ తర్వాతనే పైన ఉదాహరించిన వాక్యాలు వచ్చాయి. Criticism వేరు; Critical ability వేరు. Criticism అంటే విమర్శ అని చెప్పవచ్చు. Critical Ability అంటే గుణదోష వివేచనాసామర్థ్యమని చెప్పాలి. ఈ గుణదోష వివేచక సామర్థ్యం కవులకూ విమర్శకులకూ కూడా సమానంగానే అవసరం. ఎంత ప్రతిభావంతుడైన (Creative) కవియైనా, గుణదోష వివేచకబుద్ధి లేనివాడయి

వల్లయితే అతని నవనవోన్మేషశాలినీప్రజ్ఞ యంతా కుక్కమూతి పిందెల్ని కంటుంది. అట్టి 'వివేచన' Critical Ability) కన్న 'ప్రతిభ' (Creative gift) గొప్పదనే తెలివితక్కువ నిర్ణయం తన అభిప్రాయం కాదని ఇలియట్ చెపుతున్నాడు. ఏ ప్రతిభావంతుడుగాని, మరో ప్రతిభావంతుని కన్న ఉన్నతు డయ్యాడంటే, అట్టి ఉన్నతికి ఈ వివేచనాశక్తియే కారణమని అతని అభిప్రాయం. తన కవితాశక్తిని పెంపొందించుకోవటంకోసం తమకున్న గుణదోష వివేచక బుద్ధిని వినియోగించుకోటానికి మారుగా దానిని (కావ్య) విమర్శలకై వినియోగించాలని కొందరికి ఆశ కలగవచ్చు. సహజంగా కవులకు గొప్ప విమర్శకులం కావాలని కలిగే దుగ్ధను కవిగా ఇలియట్ మందలిస్తూ చెప్పిన సందర్భమిది.

Creative Gift అంటే కవితాశక్తి కాదు. ప్రతిభ. Critical Gift అంటేవిమర్శనాశక్తికాదు. వివేచన. దీనిని, దీని సందర్భాన్ని అర్థంచేసుకోవటంలో వచ్చిన లోపమే శాస్త్రిగారికి ఈ ముప్పతిప్పల్ని తెచ్చింది అని నా తాత్పర్యం.

పోనివ్వండి, శాస్త్రిగారు కవి వ్యాపారాన్నీ, విమర్శకుడి వ్యాపారాన్నీ నిర్వచించి యిలా చెప్పారు :

"తన విద్యచేత, తన లోకానుభవముచేత తన పరాంకోటి ఊహాశక్తిచేత, తానుద్దేశించిన వస్తుగత భావతత్త్వమును వ్యక్తీకరించువాడు కవి. తన విద్యచేత, తన లోకానుభవము చేత, తన పరాంకోటి ఊహాశక్తిచేత, కవి ఉద్దేశించిన వస్తుగత భావతత్వ వ్యక్తీకరణము లోతులందుకొని, అనుభవానందమును పొంది, తదనుభవమును సూక్ష్మ సూక్ష్మముగా ముందు వెనుకల మీది దృష్టితో విశ్లథనముచేసి, సహేతుకము, సత్వవిచారణము జరిపి తత్తత్వధర్మనిర్ణయమును చేయువాడు విమర్శకుడు." దీనితోనన్నా ఏకీభవించటానికి వీలుందా? చూదాం. శాస్త్రిగారి కవి, విమర్శకుల వ్యాపారాన్ని ఇక్కడ విశ్లథనం చేస్తున్నారు.

| కవి | విమర్శకుడు |
|---|---|
| 1. విద్య కలదు. | 1. విద్య కలదు. |
| 2. లోకానుభవం ఉన్నది. | 2. లోకానుభవం ఉన్నది. |
| 3. పరాంకోటి ఊహాశక్తి ఉన్నది. | 3. పరాంకోటి ఊహాశక్తి ఉన్నది. |
| 4. స్వయముగా వస్తువు నుద్దేశించుకొనగల శక్తి ఉన్నది. | 4. స్వయముగా కవిని వస్తువుగా నుద్దేశించుకొనగల శక్తి కలదు. |
| 5. అట్టి వస్తుగత భావ తత్వమును వ్యక్తీకరించ గలడు. | 5. కావ్య వస్తుగత భావతత్వ వ్యక్తీకరణ యొక్క లోతు లందుకొనగలడు. |
| 6. ? | 6. అనుభవానందమును పొందగలడు. |
| 7. ? | 7. తదనుభవమును సూక్ష్మ సూక్ష్మముగా విశ్లథనము చేయును. |
| 8. ? | 8. ఆ సమయమందు ముందు వెనుకల మీది దృష్టి కలిగి యుండును. |
| 9. ? | 9. సహేతుకముగా సత్వ విచారణము జరుపును. |
| 10. ? | 10. (కవి ఉద్దేశించిన వస్తుగత భావ తత్వముయొక్క) ధర్మ నిర్ణయము చేయును. |

యీసారి శాస్త్రిగారి నిర్వచనం దృష్ట్యా వారి కవికన్న విమర్శకుడే శతాధికు డనిపిస్తున్నాడు. వారి కవికి స్వయముగా కావ్యవస్తువు నుద్దేశించుకొనగల శక్తి, అట్టిదాని భావ తత్వమును వ్యక్తీకరించగల యుక్తి మాత్రమే యున్నవిగాని విమర్శకునివలె అనుభవానందమును పొందలేడు. అట్టివాడు తదనుభవమును సూక్ష్మ సూక్ష్మముగా ఎలాగూ విశ్లథనం (Analysis) చేయలేడుగదా! పైగా అతనికి ముందు వెనుకల మీది దృష్టికూడాలేదు. సహేతుకముగా సత్వ విచారణమును జరపలేడు. ధర్మ నిర్ణయశక్తి అసలేలేదు. అట్టి వాడికి వస్తుగత భావతత్వం తెలిసినదనటం అపచారమేకదా! వారి విమర్శకుడిముందు వారి కవి నిస్తేజు డౌతున్నాడు. ఈ విధంగా శాస్త్రిగారి వాదానికి నచ్చుబాటైన (నిస్తేజ) కవులందరూ వారి చెప్పుచేతల్లోనూ, కనుసన్నల్లోనూ మెలగుతూ మంచి వందిమాగధుల మనిపించుకుంటున్నారు.

నిజానికి శాస్త్రిగారు విమర్శకునికని నిర్దేశించిన 6 మొదలు 10 వరకుగల అంశాలన్నీ ఉత్తమ కవులు కవిత్వానికి ఉపక్రమించేముందే నిర్వర్తించు కుంటారు. ఆ తర్వాతనే కావ్య భాషలో రచన వెలువడుతుంది. —వెంషా.

# ప్రయాగ కోదండరామశాస్త్రి | విస్మృతగీతి

మరచిన పాటలో నొక సుమాళపు రాగమురేగి మన్మనోం
తరమున వేవెలుంగుల వెదల్గొలుపన్ రసలోలుపస్థితిన్
దరవిదళన్మహోదయ పథమ్ముల నూహలు సాచి క్రొత్తగా
పరువులు వెట్టెదన్ తెలుగు పండిన ప్రాతపొలాల వెంబడిన్.

శబ్దశాసన సుప్రసన్న సరస్వతీ
    కమ్మైన కైతకు కై మొగిడ్చి
కవి దీక్షితుని మహాకవన దీక్షావిధి
    న్వెలసిన వాణి కంజలి ఘటించి
సార్వభౌమ సమగ్ర శాసనోదగ్ర భా
    షా విలాసము శిరసావహించి
కల కళాపూర్ణుని కల్పనానల్ప జ
    ల్పిత సాహితికి దోయిలించి మించి
మనసులోని లోనిమర్మముల్ నెమకంగ
కల్పకమ్ము పూచి కానుపింప
కొదువయేమి యింక కోర్కెలకని వెన్క
దిరిగి కుదురు కొల్పితిం దిదృక్ష.

చాళుక్య నృపతపస్య మ్మెల్ల నలమన్మ
    సిద్ధి నాటికి ఫలసిద్ధినొంది
కాకతీదత్త సత్కవితా విలాసముల్
    గోనబుద్ధారెడ్డిలోన వెలసి
కృష్ణరాయల కళాతృష్ణ శ్రీనంద్యాల
    నరసింహు కృష్ణుసినాటఁ దీఱి
వీరమనీని సద్వినుత కావ్యాదృతి
    రఘునాథ రాయల రహి నెలర్చి

కాలమొక తీగయైసాగి క్రమసురభి
కుసుమ కుసుమితమై తెలుంగుల పొలాల
హారి హారిద్ర మణిరోచు లావహించు
నతి చిరంతన వాసన లధివసించు.

విన్నాణమున సుసంపన్న మపౌరుషే
యమ్మైన వాణి పేయమ్ముగాగ
అలశివంకరమైన పలుకు రామాయణ
మ్మయి దేశిశైలి నుయ్యాలలూగ
ప్రౌఢవాగర్థ ప్రబంధ బంధురమైన
తీవి భావనలోన తేవఁజూప
భారతీభవన సంభవదుక్తి వైచిత్రి
శక్రధనుర్విలాసములఁ దనుప

మత్పురాజన్మతో మహామహిమనెల్ల
నొక్కపరి దారసించి నన్నొంది నట్లు
ప్రసన్నదనమున విరసిన వదన తామ
రసము భారతీయార్యమ రశ్మి నెసగు.

ముగ్ధుడనై కళాప్రభవముల్ వసుధా విభవమ్మునైన నా
ప్రాగ్దిషణా విశేషమును ప్రస్తుతి సేసెదనింత ; నిత్య సం
దిగ్ధములౌ పథమ్ముల గతించిన కాలము కేమిలే, రస
స్నిగ్ధ పదార్థమైనకృతి నించిన యుత్సవమేఁ దలంచెదన్.

కాళిదాసు భారతకథనుమార్చినాడు. మార్పులు నాలుగైదుగా చూపించవచ్చును. భారతములోని శకుంతల రాజుకడకు పెరిగిన కొడుకుతో వెళ్ళినది కాళిదాసు శకుంతల గర్భగుర్విణి. దీనివలన రాజొకవేళ నైదారేండ్లలో శకుంతలావృత్తాంతమును భారత కథా విషయములో మరచిపోయియుండినను మరచిపోయియుండవచ్చును. ఇచట మరచిపోవుటకు తగినంత వేళయే లేదు. ఈ మార్పుగూడ కథలోని ప్రధానాంశమైన మరపునకు దోహద మిచ్చుచున్నదే కాని మరియెందు కాదు. తక్కిన మార్పులు మార్పులే కాదు. ఈ కాలపు విద్యార్థులు నాటక విమర్శన యన్న పేరుతో మూలమునుంచి కాళిదాసేమి మార్పుచేసెనో అన్న యొక ప్రశ్న. పాశ్చాత్య నాటక విమర్శ లక్షణములలో నొకదైన దానిని, తీసికొని ప్రస్తరించుకొని నిష్ప్రయోజక పరిగణనము చేయుటయే కాని తక్కినవి మార్పులు గావు. ఈ చిన్న మార్పు చేయుటవలన ఏ పాత్రయో యొక పాత్రయొక్క శీలమునందే గుణాధిక్యము సంపాదింపబడెనని గాని కథా విషయమున నీ చిన్న చమత్కారాతిశయము సంపాదింపబడినదని గాని చెప్పుట గొప్ప విమర్శ మార్గము కాదు. అవి చాల స్వల్ప విషయములు. ఇట్టి యొక పరంపరా బుద్ధి పాఠకులయందు వృద్ధి చేయుటవలన నాధునిక కావ్య విమర్శ మార్గము చాల చౌకబారై యరమణీయ మగుచున్నది. పలుమంది బుద్ధులను గాఢ భావనావ్యావృత్తములుగ జేయుచున్నవి. భవతు.

నాటకముయొక్క యాయువుపట్టు మూలకథలోని దుష్యంతుడు శకుంతలను తా నెరుగనన్న విషయమును తీసికొని నాటకమందు దానికి ప్రాముఖ్యమిచ్చుటకు నేర్పడుచున్నది.

కథ యనగా నేమి? అత డామెను ప్రేమించెను. ఆమెను పెండ్లాడెను. ఇందు కథ యేమున్నది? వాడా పని చేయదలచెను. చేసెను. ఇందు కథ యేమున్నది! ఇవి వట్టివార్తలు. వా డామెను ప్రేమించెను, ఆమెయు తిరిగి ప్రేమించెను. వారి వివాహమగుటకు నామె తండ్రి యంగీకరించలేదు. అటనుంచి కష్టము లారంభించెను. ఇచ్చట కథ యారంభించుచున్నది. లేదా మరియొక డామెను ప్రేమించుచుండెను. వాడు ప్రచండుడు. వీరి వివాహమును జరుగనీయడు. అప్పుడు కథ యున్నది. వాడా కార్యమును చేయదలచెను. అది క్లిష్టమైన కార్యము, ఆ మార్గమున చాల యడ్డంకులు గలవు. ఆ యడ్డంకులు తొలగించుటలో మిక్కిలి కష్టమున్నది. ఇతరులతో సంఘర్షణలు కలుగును. అప్పుడది కథ యగుచున్నది. ఇవి లేనిచో వార్త. ఉన్నచో కథ. అది వార్తయేమి? ఇది కథయేమి? ఒక వార్త విందుము. వినుటతో సరిపోయెను. విన్నప్పుడు ఓహో, ఇట్లు జరిగినదా అన్నంతమాత్రము మనస్సునకు నభిజ్ఞ గలుగును. ఆ వార్తయొక్క వినినవానికి గల యిష్టానిష్టములో, లాభనష్టములో మొదలైన వానినిబట్టి యా వార్త స్వీకరించుటలో వాని మనో ముద్రా లక్షణములోని తారతమ్యము లుండును. ఇది సంపూర్ణముగా లౌకికమైన వ్యవహారము. కథ లౌకికమైనది గాదు. లౌకికమైన దానియందు కథ లేదు. ఏమి జరిగినదో తెలిసికొనవలయును. ప్రతిక్రియ చేయవలయును. ప్రతిక్రియా నిర్వహణము కొఱకు ఎంత తొందరగా

తెలిసికొన్నచో నంత మంచిది. అందుచే కథా ప్రాణము వార్తలో లేదు. కథాప్రాణ మనగా నేమి? కథ యనగా వర్ణితమైన వస్తువు. కథయతి-వర్ణయతి. వర్ణింపబడవలసినది యుండగా కథ పుట్టుచున్నది. వర్ణ్యమైన వస్తువు కథకుడు. శ్రోత ఈ యిద్దరి దృష్ట్యా రెండు విధములుగా నుండును. శ్రోత్ర పేక్షయా కథ పుట్టుచున్నది. కవ్యపేక్షయా కథన ములో శిల్ప మేర్పడుచున్నది. శ్రోత్ర పేక్షయా కథ పుట్టుట యనగా నేమి? మానవుడు తన లోక వృత్తాంతమునందు జీవనముకొఱకు పలు విషయ ములు తెలిసికొనును. ఆ తెలిసికొన్నవాని ననుసరించి తన జీవికకొఱకు చేయు వృత్తము సంపూర్ణముగా శరీర సంబంధము. జీవయాత్రా సంబంధము. వాని మనస్సు తత్కాలమున సంపూర్ణముగా జీవయాత్రా లక్షణము కలదిగా నుండును. అతని మనస్సులో వింకొక లక్షణ మున్నది. జీవయాత్రా సంబంధి కాక యూరకే యుబుసుపోకను తనకు పట్టని విషయము లను వినుట. ఈ యుబుసుపోక యన్న లక్షణము మానవుని ప్రవృత్తిబట్టి మిక్కిలి భేదించుచుండును. అల్పసంస్కార బుద్ధియం దది వట్టి యుబుసుపోక. సంస్క్రియా లక్షణ మధికాధికమైనకొలది అదియొక రమణము. శ్రోత్ర పేక్షయా కథ పుట్టుచున్న దనగా రమణశీలమైన మానవుని ఈ బుద్ధి తత్కథాశ్రయమై యుండుచున్నది ఈ రమణముయొక్క ప్రవృద్ధ స్వరూపము రసము. అది కథనుండి పుట్టుచున్నది. దాని స్వరూపము ద్విధాభూతమైనది. మొదటిది కథాంశ గత విస్తృతిసాపేక్షమైనది. రెండవది పూర్వ కథిత కథాశరీర గత భిన్నవిషయానుబంధి.

కథాశరీరము రెండవ లక్షణమును పురస్కరించు కొనియుండును. ఈ కథా శరీరగతవైలక్షణ్యాతి శయముచేత కథాంశగత వర్ణనారమణీయత హృదయ స్పర్శియగును. అందుచేత కథాగత చమత్కారము కథకు ప్రాణము, శకుంతలా కథయం దొక్కడే చమత్కారమున్నది. దుష్యంతుడు విన్నెరుగనని శకుంతులతోననుట, భారతమునందలి దుష్యంతుడు ప్రకృతి జనులయందలి భీతిచేత నట్లనెను. కాళిదాసు దుష్యంతుడు నిజముగా మరచిపోయెను. నాటక కథా నాయకుడు నిజముగా మరచిపోవలయును. లేనిచో నతని శీలమునకు లోపమేదో యేర్పడి సంపూర్ణమైన రససిద్ధియందొక కళంకమేర్పడును. ఏ రమణ శీలత శ్రోతయందు పరమచిత్త సంస్కార పరిణత మనో లక్షణమునందు సంపూర్ణమైన రసాకృతి పొందవల యునో ఆ రసాకృతి కావ్యనాయకునియొక్క పరమో దాత్తతా సాపేక్షకమైనది. ఇది కొంచెము ప్రపంచించ వలసియున్నది. ఆధునికుల బుద్ధి విశ్లథమైయున్నది గనుక. రమణముదాత్త విషయమునందు జరుగును. ఉదాత్త విషయమునందు జరిగెడిదే రమణము. అనగా తొలుత ద్విధావిభక్తమైన మనస్సు చూపించ బడినది; ఒకటి లౌకిక సాపేక్షము. రెండవది లౌకిక నిరపేక్షము. తీగ కదిపినకొలది డొంకకదలును. ఈ ద్విధా భూతలక్షణము మానవునియందున్నది. ఉన్నది కనుకనే జీవుడని చెప్పబడుచున్నాడు. దీనిని ప్రపంచించిన కొలది వేదాంతములోనికి పోవును, నాస్తిక మతము నిలువదు. వేదాంతము లేకుండ మానవ జీవితములేదు. మానవ జీవితములోని విశి తత్వములేదు. సౌకుమార్యములేదు. దయాదాక్షిణ్య ములని అహింసయని ప్రపంచ శాంతియనిచెప్పుట యెల్ల జీవునియునికి నంగీకరించుట, తదంగీకార ముతో మనోరమణ మంగీకృతమైనది. తదంగీకృ తిలో నిస్సంశయముగాదని యందలి యుత్తమ మధ్య మాధమత్వములు సమాపతితములగుచున్నవి. అందుచే రస ప్రాప్తికి పరమ స్వచ్ఛమైన వస్తునయో జనము, తదకలంక భావనయు వలయుచున్నవి. లోకమునందు గూడ ఒక జాతీయనాయకుడో ఒక మహావీరుడో, ఒక మహాకవియో కావలసివచ్చు చున్నాడు జన్మ దినోత్సవములు సేయుటకు గూడ. అందుచే నుత్తమ నాయకుడు, తదాశ్రయమైన కథయే రసమును సంపాదించగలదు.

కనుక దుష్యంతుడు మృషావాదికారాదు. అయి నచో తద్గత భావన రసస్ఫూర్తము కాకపోవచ్చును.

దుష్యంతునియందు వాని శీలమునందు లోపమే యుండరాదు. ఇట్లు పాశ్చాత్య నాటకకథా వస్తువులకు ప్రాచ్యనాటక కథావస్తువులకు సముద్రమంత భేదము సమాప్తమగుచున్నది. పాశ్చాత్యుల మహా నాటకములు కథానాయక గత నిగూఢమైన యొక పాప భావనయో, వారి శీలములోనియొక ప్రముఖమైన కళంకమో. యాధారముచేసికొని ఏర్పడుచున్నవి. వారికి కథా పరమార్థము తత్పాపకళంకాదులలో వితర సన్నివేశ సన్నికర్షజనిత కథాపసానము పరమార్థముగాగలవి. ప్రాచ్య నాటకములు నిష్కళంకుడైన కథానాయకుని జీవితములోననూహితమై, దైవ ప్రేరితమై, కర్మ సమాప్తమైన యొక పరిస్థితియందు వాని ధర్మానుబంధియైన ప్రవర్తన నిరూపించుట పరమార్థముగాగలవి. ఇచట నొక ప్రశ్న పుట్టవచ్చును. ఆ పాశ్చాత్య నాటక కథానాయకులయందు పాఠకునకు సానుభూతి కలుగును. ఈ ప్రాచ్య నాటక కథానాయకునియందు సానుభూతి గలుగదని. సానుభూతి యనగా నేమి? అయ్యో పాపము, వాడును మనవంటివాడే అనుకొనుటయేనా। దీనిని కొంచెము పొడిగించినచో ఆ యొక్క దోషము వానియందు లేనిచో నెంత బాగుండెడిది? ఇట్లు జరిగెడిది కాదే. అనిపించుటయు మానవసహజమే గద. ఆ యనిపించున దేమి? ఇహలోకమందు దోష పరిపూర్ణమై దుఃఖభాజనమై కనిపించుచున్న పరిస్థితులకు మించి వీనినుండి వివర్జితమైన యొక నిర్దుష్ట స్థితియందలి యనురాగమే కదా అట్లనిపింపచున్నది. ఆ యనురాగ మెందుకున్నది? అది జీవలక్షణము. అట్టి స్థితిని జీవుడు వాంఛించుచుండును. అందుకనియే ప్రాచ్య నాటక కథానాయకుడు సర్వసద్గుణసంతుడు. వాడైనను మానవ శక్త్యతీతమైన యొకదైవికమైన కర్మవాగుర యందు తగుల్కొనుట గలదు, ఈ యతని జీవితము ఆ కర్మవాగుర, దాని అనధిగతత్వము, ఇది యంతయు ప్రాచ్యదేశ నాటకముల నాటకత్వము. భారతీయ మహానాటక కర్తలయొక్క నాటకమన్న భావము దీనియం దున్నది. ఇది యింకొకచోట చెప్పబడును. ప్రధానముగ ప్రాచ్య పాశ్చాత్య నాటకముల భేద మిది. భారతీయ నాటకములయందు నిక్షేపింపబడునది రసము. ఎప్పుడు రసము నాటక ప్రధానలక్షణ మగుచున్నదో మనుజుల శీలములలోని భేదములకు, ఇహలోక చిత్రవృత్తములకు ప్రాధాన్యము పోవుచున్నది. వాని కంగిత్వము లేదు. అంగత్వమున కెప్పు డత్యంతరము లేదు. రాజభటులు నీవీ యుంగరమును దొంగిలించి తెచ్చితివా యేమని పల్లెవానిని బాధించిరి. వాని దగ్గర నేదో గుంజుకొనుటకు ప్రయత్నించినట్లు కన్పించుచున్నది. ఈ కథ అప్పుడు ఇప్పుడు ఎప్పుడు నొక్కటే. అంగములయం దిట్టి లక్ష చమత్కారము లుండవచ్చును. అంగి నిర్దుష్టముగా నున్నచో పాఠకుని రమణశీలత పరాకాష్ఠ పొంది రసముగా మూర్తికట్టును. అది పరమోదాత్త చిత్తసంస్కార లక్షణవంతుడైన భావుకుని నిత్యస్థితి. జీవుడు తన జీవత్వసిద్ధిని కనుట. దానిపేరు రసము. 'రసోవై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి।' ఇది కట్టిపెట్టి దుష్యంతుడు మృషావాది కాకూడదు, ఛలవాదియు కాకూడదు. దుష్యంతుడు ఛలవాదియే యని కొంద రనవచ్చును.

"క్వవయం క్వపరోక్ష మన్మథో
మృగశాబైస్సమమేధితో జనః
పరిహాస విజల్పితం సఖే
పరమార్థేన న గృహ్యతాం వచః"

ఇది దుష్యంతుడు మృషావాదనము చేయునప్పుడు చెప్పుదురు. ఇది మృషావాదన మైనచో ద్వితీయాంకముదాక రానక్కరలేదు, ప్రథమాంకములోననే యున్నది.

"రాజా (స్వగతం)అవసరోయ మాత్మానం దర్శయితుం. కః కోఽత్రభోః (ఇత్యర్ధోక్తే విచార్య రాజభావ స్త్వభిజ్ఞాతో భవేత్. భవతు ఏవ మభిధాస్యే)" అనియును.

ఉంగర మిచ్చి వా రసుమాన పడుచుండగా 'అల మన్యథా మాం సంభావ్య, రాజ్ఞఃపరిగ్రహోఽయం' అనియును అన్నాడు. "అనేన రాజరాజకీయమోస్వామా

న్యేన వచనేన ప్రచ్ఛాదనం కృతం"అని వ్యాఖ్య. ఈ ప్రచ్ఛాదనము మృషావాదనమా? కాకపోవచ్చును. ఇచ్చట ప్రచ్ఛాదనమే "క్వవయం..." దగ్గర ప్రచ్ఛాదనమనుటకు వీలులేదందురా? "రాజ్ఞః ప్రతిగ్రహోఽయం" అన్నప్పుడు తనకది రాజునుండి సంక్రమించినదనియేగదా. రాజత్వ మనునది సంక్రమించిన దుష్యంతుడను నొక వ్యక్తి. ఇద్దరు వ్యక్తులు రాజు, దుష్యంతుడు ఒప్పుకొందము. అలంమా మన్యథా సంభావ్య- నన్నింకొకరుగా ననుకొనకుడు. నేను రాజునే యింకొకరుకాను అనునర్థమేల కారాదు? నేను రాజును కాను అన్న అర్థమెట్లు సమాక్షిప్తమగుచున్నదో నేను రాజునే అన్నయర్థమట్లే సమాక్షిప్తమగుచున్నది. ఇదియే ప్రచ్ఛాదనము. నిజమేమో చెప్పుటయున్నది. అన్యార్థ మితరులు స్వీకరింతురు. చెప్పిన మాట స్వీకరించుటకు వీలుగానుండును. మహా తపస్వులుగూడ లోక దృష్ట్యా ఇట్లే మాటాడుదురు. కనుక ప్రచ్ఛాదనము, మృషయు రెండు రెండుగా తేలినవి. అయినచో 'క్వవయం క్వపరోక్షమన్మథః' అన్న శ్లోకములో గూడ నిట్టి ప్రచ్ఛాదనమున్నదా యన్న ప్రశ్న పుట్టును. ఉన్నది. ఎందుకనగా దుష్యంతుడు శకుంతలను గూర్చి తనయభిలాషయంతయు విదూషకునితో పలువిధముల వర్ణించి చెప్పి యీ మాటతో కాదన్నచో పోవునా? మరియు రాజేమనుకొని యిట్లుచెప్పును? రాజిట్లనుకొనెను. 'చపలోఽయం వటుః కదాచి దస్మత్ప్రార్థనామంతః పురేభ్యః కథయేత్ ప్రభవత్వేన మేవం వక్ష్యే' ఇతనికి మనస్సు నిలువదు. నాయీ కోరిక అంతఃపురములో చెప్పునేమో ఇతనితో నిట్లుచెప్పుదును. అనియనుకొని మనమెక్కడోయి, లేళ్ళతో సమంగా బెరిగి శృంగారపు వాసనలేని ఆ పిల్ల యెక్కడ? అన్నాడు. అనగా ఆమెయందు మన ప్రార్థన ఫలవంతముగాదు. అనియేగదా యర్థము. అంత మాత్రముచేత తన ప్రార్థన లేకుండపోయినదా? ఫలవంతముగాని ప్రార్థన యుండియేమి? లేకయేమి? అని విదూషకు డనుకొనవలయుననియేగద. అట్లనుకొనువాడనియేగదా? అనగా విదూషకుడు యథార్థ విషయమునందు పట్టించుకొనువాడుగాని తక్కినవి పట్టించుకోనినాడని యర్థము.

మరియు నీమాట పరిహాస విజల్పితము. నిజముగా తీసికొనకు. అని యుత్తరార్థము. వచః—మాట. ఇదియంతయు నూరకే చెప్పితిననలేదు. పరిహాస విజల్పితమైన వచస్సును పరమార్థముగా తీసికొనకు. ఆవచస్సేమిటి? 'సురయువతి సంభవంకిల...చిత్రేనివేశ్య...అనాఘ్రాతం పుష్పం...అభిముఖే మయి......దర్భాంకురేణ' ఇవన్నియు కలిపి ఆ ఒక్కమాటయా? అతడు మాత్రము నమ్మునా? కనుక నతడు నమ్మదగినదొక్కటే విషయము. రాజుయొక్క ప్రార్థన ఫలవంతముగాదు. అందుచేత నీవార్తచెప్పి యంతఃపుర స్త్రీల నుడికించ నక్కఱలేదు.

అయినచో 'పరిహాస విజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాంవచః' అన్నదానికన్వయమెట్లు? పరిహాస విజల్పితమైన మాట యేదనగా శ్లోక పూర్వార్థమందలి విషయము. మనమెక్కడ? పరోక్ష మన్మథమైన యాజనమెక్కడ? అన్న మాటలోని యర్థము పరిహాసముగా చెప్పినాను. ఆమెయందు నాకు ప్రేమగలదు. ఆమెకు నాయందు ప్రేమగలదు. నా ప్రార్థన ఫలవంతమే కాదని నీతో చెప్పుచున్నాను. అది పరిహాసము. ఈ రీతిగా ప్రచ్ఛాదనము పొసగుచున్నది.

కనుక నీ రీతిగ దుష్యంతుని శీలము నిర్దుష్టమైనది. ఆయన మహానుభావుడు. ఇంకొక విషయమేమనగా భారతీయ కావ్యములందు కథానాయకుడు కులీనుడు, శౌర్యవంతుడు, అవికత్థనుడు, దయావంతుడు, ఇత్యాది సర్వగుణ సంపన్నుడై యుండవలెను. దుర్గుణవంతుడు కారాదు. దుర్గుణములు ప్రతినాయకునియందుండవలెను. కావ్యమేమగుచున్నది? దేవాసుర యుద్ధమువంటి దగుచున్నది. శృంగారరసమైనచో ప్రతినాయకుడే లేడు. అంతటి సద్గుణవంతుడైన నాయకుడు స్త్రీని వివాహమాడి నేను వివ్నెపగను పొమ్మనుట లేదు. విడాకు లిచ్చుటలేదు. కథ

యెట్లు నడువవలయును? కథ యేమికావలయును? సర్వసద్గుణ సనాథుడైన కథానాయకుడు కథలో మార్పు చేయుటకు వీలులేదు. కథానాయకుడు మూసలో పోసినవాడు. కవి కల్పించవగిన దేమియు కల్పించుటలేదు. పాశ్చాత్య కావ్యముల యందలి కథ లన్నియు సర్వసద్గుణ సంపన్నుడైన కథానాయకుని కిపతల నున్నవి. భారతీయ కవులయొక్క కథ లన్నియు సర్వసద్గుణ సంపన్నుడైన కథానాయకున కవతల నున్నవి. వారి వీరి కావ్యముల వస్తువులకే సంబంధము లేనట్లున్నది.

ఇప్పుడు దుష్యంతు డట్టివాడు. తరువాత కథ యేమున్నది? కల్పనయంతయు విప్రలంభ సంయోగ శృంగార విషయిక వ్యభిచార్యాది భావసమాశ్రయమై యుండవలెను. లేదా మాళవికాగ్నిమిత్రములోవలె నాయికానాయక సంయోగమునకు వేఱు ప్రతికూలము లైన శక్తు లేర్పడి ప్రతిరోధము లేర్పరువవలయును. అప్పుడది నిజమైన కథ యగునో కాదో? ఆ కథా విస్తృతి వీరరససంబంధి కథా విస్తృతి వంటిది. అనగా వీరరసములో నాయకు డొక మహాకార్యమును చేయబోగా ప్రతినాయక ముఖమున నడ్డంకులు కలుగుచుండును. ఇదే వీరరససంబంధి కథావిస్తృతి లక్షణము. శృంగార రసములో నాయికా నాయక సంయోగము జరుగుటకు ఇతర రాజభార్యల కారణముగ తత్సమాగమము దూరమై కథావిస్తృతి జరుగుట సరిగా వీరరస కథావిస్తృతివంటిది గదా. అందుచేతనే అట్టి శృంగారరస కథ నాటికగా చెప్పబడినది. మాళవికాగ్నిమిత్రము, రత్నావళియు నిట్టివే. అచ్చట కథలు లేవు. సన్నివేశములు కలవు.

శాకుంతలమునందు కథ గలదు. ఏ సందర్భము లున్నచో కథ యగును? ఎట్టి యంశములు కలిగినచో కథ యగునో, యెప్పుడు కథ గాదో ఈ విభాగముచేత పూర్వులు విస్పష్టము చేసిరి. శృంగార రసమునందు కథ కలుగుట కష్టమైన విషయము. బహు విషయములు, సన్నివేశములును, పరిస్థితులు మారుటయుగానై, సామాన్య శృంగారరసమునందు కథ యేర్పడదు. ఇది కథయని చెప్పదగిన శృంగార రస సంబంధకథ యుండుట కష్టము. శకుంతలా వృత్తాంతమునందు శృంగారరసముండి కథ యనిపించుకో దగిన స్థితి యున్నది. ఇది చాల సుకుమారమైన విషయము. పరమసూక్ష్మమైన విషయము. నిశితాదరముతో పరిశీలించినగాని యవగతి కొగ్గదది. అయినచో దీనియందలి కథాత్వ మెట్టిది? దీని యందలి కథాత్వ మిట్టిదని నిరూపించినచో తక్కిన వాని యందలి కథ లేనితనము కూడ తెలియును.

శృంగారరస మనగా నాయికా నాయకుల పరస్పర నివిష్టచిత్త లక్షణము కలది. ఈ పరస్పరానురాగముండి యెడబాటు కోపము, కలహము, దూర దేశగమనము, ప్రతిజ్ఞాది విషయముల చేత రసమునకు భంగమెప్పుడును గలుగును. అందుచేత కథ యేమున్నది? మనోవృత్తులయందు, భావనా విశేషములయందు, మార్పున్నది. కథ యెప్పుడు సంగతమగును? రసభంగభీతికలిగినప్పుడు జరుగును. ఎందుచేత? వర్ణ్యము రసాశ్రయమైయుండును గనుక. వీరాది రసములయందలి కథ ప్రతినిమేష రసభంగ భీతిజనకము. ఇది యింకను పరమ సూక్ష్మమగు విచారణమీద నాధారపడియున్న విషయము మానవుని ప్రవృత్తియైన తొలుత చెప్పిన మనోరమణము కథాశ్రయమైయుండుననగా కథాగతరసాశ్రయమైయుండునని యర్థము. కథ రసాశ్రయమై యుండును, రసము కథాశ్రయమైయుండును. ఆ రసము వ్యభిచారి సాత్వికాది భావాశ్రయమైయుండును. ఈ వ్యభిచార్యాదులచేత ప్రవృద్ధమానమై స్థాయి రసమగును. అనగా స్థాయియందు రసము యొక్క బీజమున్నదని యర్థము. ఆ రసబీజము మానవ మనోగతమైన తద్భిన్న రసములయొక్క స్థాయి సంతతియందు నిత్యమై, మానవ మనోగతమై యున్నది. అది రమణశీలమైయుండును. కథ అచ్చట పుట్టుచున్నది. కథ అచ్చట తగుల్కొనుచున్నది. దుష్యంతుని కథయందు కథాత్వమెందుకున్నదనగా శృంగారరసము ప్రవహించుట యారంభించినది.

విస్మృతిచేత రసభంగము ప్రాపించినది. కథ భిన్నమైపోయినది. కథలేదు, కాని తరువాత కథ జరిగినది. ఇవిరెండు కథలు గావలయును. రెండు రెండు భాగములైనచో, రెండు, రెండు కథలు కావలసివచ్చును.

అప్పుడు కథలు కావు. సన్నివేశములు కావలెను. ఈ రెండు భాగములను కలిపి కథగా తీర్చవలయును. ఎట్లు కథ యగును? కథకు ప్రాణమేమి? ఏక రసత్వము. ఆ యేకరసత్వమును ఈ విస్మృతితో జోడించి సంధానపరచుటలో కథాత్వము సిద్ధించు చున్నది. ఆ యేకరసత్వ సిద్ధిసంధాయకముగా విస్మృతిని కలిగించుటలో కాళిదాసుని జగన్నాథత్వ మున్నది. కథారహస్య పరిజ్ఞాన మున్నది. కథా స్వరూప వేత్తృత్వ మున్నది. అటు మాళవికాగ్ని మిత్రము వ్రాసి, ఇటు శాకుంతలము వ్రాయుటలో శృంగారరస సంబంధమైన కథ యెట్లుండునో, యెట్లుండదో తెలిసికొనిన భేద పరిజ్ఞాన మున్నది.

ఈ కథాగత తత్త్వము చాల నిగూఢమైన విష యము. సుశిక్షితమై, సుసంస్కృతమైన చిత్తవృత్తి యొక్క రమణలక్షణములోని పరమౌచిత్యము నందు కూడియున్న విషయము. ఈ పరమ రహ స్యముమీదనే రసభంగాలు వివక్షింపబడినవి. విరోధి రసములు, మిత్రరసములు అన్న వివక్ష యేర్పా టైనది. రసవృత్తితో నేకీకృతి పొందిన విశుద్ధ మైన యంతఃకరణము నందలి రహస్య మిది. కథ యందలి కథాత్వ మచట సిద్ధిత మగుచున్నది.

కాళిదాసు ఆ పట్టు తెలిసినవాడు. దాని నెరుగుట యనగా రసబ్రహ్మ నెరుగుట. ఈ విస్మృతి యట్టిది.

## దండమూడి మహీధర్ | చెడి బతికినవాళ్లు

ఊరికి దక్షిణంగా పంటకాలవ వంతెనమీద చతికిలబడి రాముడు అటూ ఇటూ చూశాడు. కాలవ నీళ్ళు పడమరనుంచి తూర్పుదిశకు ప్రవహిస్తున్నాయి. సాయంత్రపు నీరెండకు నీరు తళతళా మెరుస్తున్నది. వంతెనకు అల్లంత దూరానున్న చావట్లోనుంచి.... మువ్వల ధ్వని విన్పిస్తూంది. ఆ ధ్వని మధ్యలోనుంచి ఎవరో....'హోయ్! నీ ఎద్దును కోసెయ్యా !....హోరీ నీ....' అంటున్నారు. పొలాలమీద గడ్డి కడేలు....దూరానికి గుడిసెలకు మల్లే కన్పిస్తున్నాయి. పిల్లిమిసర, మినుము, పెసర వేసిన పొలాలు, వాటి పక్కన విరియబూచిన పచ్చ పూలతో నిలబడి తలలూపే జనపకాషలు... కొత్తగా పెళ్ళయ్యిన ఆడబడుచుకుమల్లే కన్పిస్తున్నాయి.

రాముడు తను నడిచివచ్చిన దారివేపు చూశాడు! తాచుపాముకు మల్లే కన్పించింది. ఎవరో తనను ఇంకా వెన్నాడుతున్నట్లు ఉల్కిపడి లేచి నిల్చున్నాడు. పాంట్ జేబుల్లో చేతులు పెట్టుకొని ఒక్కసారి ఊరివేపు చూశాడు! వంతెన ప్రక్కగా వెళ్ళి కాలవలో మొకము కడుక్కున్నాడు. తడిచేతులతో తల సవరించుకొని— పాంట్‌కు వెనకపక్క జేబులోని చిన్న దువ్వెనతో తల దువ్వుకున్నాడు! జేబురుమాలతో మొహం తుడుచుకున్నాడు! వచ్చి మళ్ళీ వంతెనమీద నిలబడ్డాడు! పాంట్‌మడత చేత్తో సరిజేశాడు! తొడుక్కున్న శ్లాక్ షర్ట్ కాలర్‌ను చేత్తో ఇస్త్రీ చేసుకొని బయలుదేరాడు.

ఊరి వేపుకు వెళ్ళటానికి ఒక్క అడుగు ముందుకు వేశాడో లేదో వెనకనుంచి కేక విన్పించింది :

"ఏఊరండీ మంది? ... ఎవరింటి కేమిటి?...."

రాముడు వెనక్కు తిరిగి చూశాడు! 'సూరపనేని వెంకట్రామయ్యా గారింటికా? ... లేకపోతే వట్లూరుపల్లి బుల్లెయ్యా గారింటికా? .... నేను సూరపనేని వారి చిన్న పాలేర్నండి! అంటే గొడ్లి కాడ పనిచేస్తాను!' అన్నాడు! ఆ అన్నవాడి నెత్తిమీద పిల్లిమిసర మోపుంది! రాముడు అప్పటికీ మాట్లాడలేదు. అతని మొహంలో మొహం పెట్టి చూశాడు!—"ఏదో ఊరికే అడిగాలెండి మీరెవరో కొత్తోరిలాగా కన్పిస్తే! వట్లూరుపల్లి వారిల్లు కూడా మా సూరపనేనినారింటి పక్కనేలెండి!...

...మీలాగా తెల్లబట్ట లేసుకున్న వాళ్ళంతా ఈ రెండిళ్ళకు తప్పిస్తే మరోచోటికెళ్ళరండి!... అసలు మావూళ్ళో ఉన్న గడపెంత లెండి?"... అన్నాడు సూరపనేని వారి గొడ్లకాడ బుడ్డాడు!

'నీ పేరేంటి?' అని రాముడు ప్రశ్నించాడు ఒక చెయ్యి ప్యాంటు జేబులో పెట్టుకుంటూ!

'నా పేరాండి... ఏదో ఉందిలెండి! మా అమ్మ వెంకటేశం అంటుంది. మా దొరగారేమో... 'వెంకాయ్' అంటారు! నేను "గొల్లాళ్లకుర్రాడిని లెండి... మా అమ్మ పెరుగు వ్యాపారం చేస్తుంది. రోజూ గుడివాడ వెళ్లొస్తుంది. మా అయ్యకు కాళ్లూ చేతులూ చచ్చుపడ్డాయండి!... నాకు ఫరవాలేదు లెండి... సూరపనేనివారు మూడు తూములు వడ్లిస్తారు... ఒక జత బట్టలు... పండగలొస్తే ఒకణా డబ్బులు చేతులో పడేస్తారు!...'

ఇద్దరూ ఊరివేపుకు బయలుదేరారు!... రాముదేమీ మాట్లాడలేదు. ఎవరో ఒకరిద్దరు ఎదురొచ్చి 'ఏ వూరండీ!' అని అడిగితే ఏదో గొణిగాడే

గాని సరైన సమాధానం చెప్పలేదు. అట్లాగే ఊరు ఇంకో ఫర్లాంగుదూరముందనగా ఎవరో అడిగితే వెంకటేశం అందుకుని'మా ఇంటి కేనండీ!' అన్నాడు.

రాముడు వెంకటేశాన్ని నిలేసి—'నే నెవరు తెలుసా ?' అన్నాడు !

'తెలియదండీ !' అన్నాడు, వెంకటేశం !

'అండీ గిండీ అనబోకు !' అని కసురుకున్నాడు రాముడు—"నా పేరు రామాయ ! చాకలి గంగాయ కొడుకుని ! తెలిసిందా ?"

'ఓరి నీయమ్మ నువ్వంట్రా ! నీ వేషం చూసి ఎవరో షావుకారి బిడ్డవనుకున్నా నే!' అని అంటూ మోపు కింద పడేశాడు ! 'చాలా పెద్దవాడి వయ్యావే !... ఈ పది సంవత్సరాలు ఎక్కడెక్కడ తిరిగావేంటి ?...దసరా బుల్లోడికి మల్లే తయారయ్యావే! ఏమన్నా ఉద్యోగం చేస్తున్నావా...?"

అని అంటూ వెంకటేశం రాముణ్ణి పరీక్షగా చూశాడు. రాముడు సమాధానం చెప్పలేదు. రాముడు— ఊరు వదిలాక ఎక్కడెక్కడ తిరిగాడో, ఏమేమి చేశాడో చెప్పాలంటే ఒక రోజు కథ !...

వాడికి మొదటి నుంచీ ఇంటింటికీ తిరిగి బట్టలు ప్రోగుచేసుకొని రేవు దగ్గరకు చేర్చటం, ఉదికిన బట్టలు—ఎండబెట్టడం, అవి ఎండేదాకా ఉండి వాటిని మడతలుపెట్టి ఊళ్ళోకి తీసుకెళ్ళటం— ఇలాంటి పనులమీద అతని కిష్టముండేది కాదు. అయినా కొంత కాలం ఆ పనులన్నీ చేశాడు ! ఆ తరువాత అతనికి చదువుకోవా లనిపించింది ; చదువుకొని ఉద్యోగం చేయా లనిపించింది. ఈ కోర్కె తండ్రికి చెప్పాడు ; ఆ రోజు వాడి వళ్ళు హూనం హూనం అయ్యింది. ఆ రెండో రోజే వాడు ఊరు విడిచి పారిపోయాడు ! 'అక్కడా ఇక్కడా తిరిగి నాలుగైదు రోజుల్లో వాడే తిరిగొస్తాడులే !' అని తండ్రి ఊరుకున్నాడు ! కాని వాడు తిరిగి రాలేదు. ఆ దిగులుతోనే రాముడి తల్లి చనిపోయింది. అప్పుడు గంగడు వాడికోసం వెదికాడు ; కాని ఎక్కడా పత్తాలేదు. ఊరుకున్నాడు. రాముడు తిరగరానిచోట్ల తిరిగి, పడరానిపాట్లు పడ్డాడు ! చదువుకోదలచు కున్నాడు ; కాని వీలుకాలేదు. అయితే ఉద్యోగం మాత్రం దొరికింది ! ఒకటి కాదు: రకరకాలైన ఉద్యోగాలు! ఒకటీ నిఖరమైందికాదు. చూస్తూండగానే ఊడిపోయేది ; కొందరు తిండిమాత్రం పెడితే, కొందరు కట్టుకోటానికి బట్టలిచ్చి, ఇంతే అన్నారు, మరి కొందరు- ఇంత ఇస్తామని చెప్పి ఆఖరున అడిగితే తన్ని పంపారు ! ఎట్లాగయితేనేం— ఊరితో సంబంధం లేకుండా... వెళ్లినచోటికి వెళ్లకుండా దేశమంతా తిరిగొచ్చాడు ! నాలుగైదు భాషలు కచ్చాపిచ్చిగా మాట్లాడేస్తాడు ! ఏ పట్టణం ఎందుకు ప్రసిద్ధో ఇట్టే చెప్పేస్తాడు ! ...చివరకు వాడికి నగర జీవితం మొత్తిపోయింది....డబ్బూ దర్పం,ఉద్యోగం సద్యోగం ఉన్నవాళ్లకే గాని మామూలువాడికి అక్కడ చోటులేదని తెలుసుకున్నాడు. ఉన్న ఊర్లోనే ఉండి కలో గంజో తాగుతూ తలిదండ్రులు చెప్పినట్లు బతకటమే మంచిదని తీర్మానించుకున్న వాడై ఇంటి ముఖం పట్టాడు.

ఇక్కడ ప్రథమంగా కలిసినవాడు వెంకటేశం ! అంత అమాయకమైన మనిషిని చూచేప్పటికి రాముడికి చాలా ఆశ్చర్యమేసింది ! పట్టణజీవితంలో ఇలాంటి మనుషులు కంచుకాగడా బెట్టి వెదికినా కన్పించరు. అక్కడ వెనుక దగా ! ముందు దగా ! ఎవరినీ నమ్మటానికి వీల్లేదు. ఎంత సేపటికీ ప్రతిఒకరూ ఒకరికంటే మిన్నగా ఉండటానికే ప్రయత్నిస్తుంటారు ; నాలుగు పైసలు ఎలా సంపాయించాలా అని పథకాలు వేస్తుంటారు !... కాని ఇక్కడో ? అలా కాదు ! తను తింటారు, నలుగురికి పెడతారు ! ఉన్నవూళ్లో నుంచి కాలు కదపరు! అదే వైకుంఠం ! బయటి ప్రపంచంతో పనిలేదు !..

'ఏమిటి మాట్లాడవు ? నీ ఉద్యోగ మేంటి ? జీత మెంత ?' అని అడిగాడు వెంకటేశం కింద పడేసిన మోపు సరిచేసుకుంటూ !

రాముడు మామూలు ప్రపంచంలోకి వచ్చాడు! నీకు 'డ్రైక్లీనింగ్' అంటే తెలుసా ?

"నీకు తెలీదులే ! పెద్ద పెద్ద ఉద్యోగస్తుల బట్టలు, పెద్ద పెద్ద షావుకార్ల బట్టలు ఉతకటాన్ని 'డ్రై క్లీనింగ్' అంటారు; పెద్ద పెద్ద నగరాల్లో మన ఊళ్ళోకిమల్లే బట్టలు తడిపి బండ కేసి బాదరు. అంతా మిషను ద్వారా జరిగిపోతుంది.... అలాంటి మిషను పని నేర్చుకొచ్చాను నేను!. ఐదేళ్లు మద్రాసులో- 'కోడంబాకు కట్టబొమ్మన్ లాండ్రి'లో తర్ఫీదయ్యా నేను....ప్రస్తుతం హైద్రాబాద్‌లో చార్ మీనార్‌కు పడమరగా వందగజాల దూరంలో ఉన్న 'అలీబేగ్ డ్రైక్లీనింగ్' షాపులో మేనేజరుగా పనిచేస్తున్నాను! ఏదో ఉన్న ఊళ్లోనే కాలక్షేపం చేద్దామని ఊహించుకొని- ఇక్కడికి బయలుదేరి వచ్చేశాను !" అని అన్నాడు రాముడు!

'ఓరి నీ తస్సాదియ్యా!... చాలా గొప్పోడివయ్యావే ! అయితే పద—నువ్వుమాట్లాడిన ఇంగిలిపీసంతా మా వెంకట్రామయ్యదొరగారికి వినిపిద్దువుగాని !'

'ముందు వెళ్ళి మా అయ్యను చూడాలి !' అన్నాడు రాముడు!

'ఓరి నీ యమ్మ! ఇంకెక్కడి అయ్యరా? ఉడకేసి పెట్టేవాళ్లు లేరనే దిగులుతో కునారిల్లి కునారిల్లి కిందటేడు కళ్లుమూశాడుగా !... సూరపనేనోర్నీ, వల్లూరిపల్లోర్నీ కనిపెట్టుకుని బతుకు— నాలుగు చోట్ల తిరిగొచ్చినోడివి–నీకేం?...అదేదోఅన్నావే... దాన్నిగురించి మా దొరగారి చెవున వేశావంటే రేపిపాటికి...వారి చావిట్లో నీకు చోటు చూయించరూ ?' అని అన్నాడు వెంకటేశం మోపు తల మీదికి ఎత్తుకుంటూ 'నడువ్ !'

రాముడు యంత్రానికిమల్లే వెంకటేశాన్ని అనుగమించాడు.

'అయితే మా అయ్య లేడూ !' అన్నాడు, కొంచెం బాధగా!

'మీ అయ్య లేకపోతే ఏం... వెంకట్రామయ్యగారు లేరా, బుల్లెయ్యగారు లేరా... మరిచేపోయా... అదిగో చూడు, ఆ కన్పించే రెండంతస్తుల మేడ... సుబ్బయ్యగార్ది ! సుబ్బయ్యగారంటే ఎవరో తెలుసా ?... ఉత్తరాది నుంచి పై పంచెతో మనూరొచ్చాడు; వచ్చినప్పుడు సెంటుభూమి లేదు; ఇప్పుడు పదిహేను ఎకరాల భూమి సంపాదించాడు, మేడ కట్టించాడు...వడ్లవ్యాపారం!...ఆయన పెద్ద కొడుకున్నాడే అప్పారావు...యఫ్. ఏ. మూడు సార్లు తప్పాడు...పెద్దగ్యాంగు ఆయనకు ఊళ్ళో !

రాముడు 'ఊం' కొడుతూ నడుస్తున్నాడు. ఊరు సమీపించింది. చెరువు గట్టుకు అల్లంతదూరాన గుడిసెల మధ్య ఒక అందమైన ఇల్లు కన్పించేప్పటికీ రాముడు ఉండబట్టలేక 'ఆ ఇల్లెవరిది? అని అడిగాడు!

'ఆ ఇల్లా ?...ఆ ఇల్లు రంగామది...కాదు—రంగమ్మది...పరంధామయ్యగారు కట్టించారులే ఆ ఇల్లు !...రంగమ్మను ఆయన ఉంచుకున్నారుగా!

చీకటిపడింది ! బజారు మలుపు మీద జనం కూర్చొని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. వెంకటేశాన్ని, రాముణ్ణి మాట్టానికి చాలా మంది చూశారు గాని, ఎవరూ పలకరించలేదు, చీకట్లో ఎవరో ననుకున్నారు.

వెంకటేశం రాముణ్ణి సూరపనేని వారింటికి తీసుకెళ్లి —యజమానికి పరిచయం చేశాడు. అంతా విని ఆయన—'ఓరి నీయమ్మ నువ్వంట్రా !...అసలు గుర్తే తగలటంలేదు! చాలా మారిపోయావు ! సరే—ఈ ఊళ్ళో నువ్వు లాండ్రీ షాపు పెడితే బాగానే ఉంటుంది. ఊళ్ళోని వెధవలు బట్టలు సరిగా చేయటంలేదు ! డ్రైక్లీనింగ్ అసలు వాళ్ళకు తెలీనే తెలీదు! నలుగురికి చెప్పి ఏర్పాటు చేయిస్తాను ! అందాకా మా పంచనే ఉండు !' అని వెంకటేశం యజమాని అభయమిచ్చాడు, రాముడికి !

రెండు రోజులు గడిచాయో లేదో ఊళ్ళో వాళ్ళందరికీ — రాముణ్ని గురించిన భోగట్టా

యావత్తూ తెలిసిపోయింది. ముఖ్యంగా యఫ్.ఏ.లు, బి.యేలు తప్పి—ఊళ్ళో కాలక్షేపం చేసే కుర్రాళ్ళకు మాత్రం రాముడు తెరవబోయే 'డ్రై క్లీనింగ్ షాపు' సమాచారం చాలా పరమానందాన్ని కలిగించింది. చదువుకునే రోజుల్లో కుట్టించుకున్న ఖరీదైన బట్టలన్నీ బయటికి తీశారు. ఇలాంటి షాపు మన ఊళ్ళో ఉండాల్సిందేనని — చెరువు గట్టుమీద లైబ్రరీ ముందు అందరూ కూడబలుకున్నారు; పెద్దవాళ్ళకు దాని ఉపయోగాన్ని గురించి చెప్పారు!

నాలుగు రోజులు గడిచాయి.

ఐదోరోజు ఉదయాన...రాముడు వాగ్దానం చేసిన వాళ్లందరి ఇళ్ళకూ వరసగా వెళ్లాడు! మధ్యాహ్నానికల్లా ఐదొందల రూపాయిలు పోగయ్యాయి! ఈ మొత్తం—డ్రైక్లీనింగ్ మిషనుకు, ఇతర పరికరాలకు సరిపోతుందని చెప్పి—అప్పటికప్పుడే విజయవాడ బయలుదేరాడు! రెండో రోజు ఉదయానికల్లా సామానులు సహా వస్తానన్నాడు! అంతా సరేనన్నారు! వెంకట్రామయ్యగారూ, పరంధామయ్యగారూ రాజకీయ బాధితుడుగా పొలం పుచ్చుకున్న పూర్ణయ్యగారూ, మైనరు వెళ్ళని తన అన్నకొడుకు ఆస్తినిసంరక్షిస్తున్న సూరయ్యగారూ— ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు?... ఎందుకయినా మంచిదని రాముడి వెంట ఊళ్లోని ఇద్దరు కుర్రాళ్ళను కూడా పంపించారు! వాళ్ళిద్దరూ ఊళ్లో ఉన్న కుర్రకారం దరిలో చాలామంచివాళ్ళనీ, తెలివిగలవాళ్ళనీ— ప్రసిద్ధి! అందుకే రాముడివెంట వాళ్ళను పంపించారు. ముగ్గురూ కలిసి— విజయవాడ వెళ్ళిపోయారు.

ఇక ఊళ్ళోనివాళ్ళందరూ—ముఖ్యంగా నాలుగు ఇంగ్లీషుముక్కలు నేర్చుకుని ఊళ్లో సరదాగా కాలక్షేపం చేస్తూ కొత్తసినిమా విడుదలైందని తెలీటంతోటే గుడివాడ పరుగెత్తుకెళ్ళే బాపతుకు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి!

ఉలెన్-ట్వీడ్ సూట్లూ!... అమెరికన్ స్ట్రైప్ షార్క్ స్కిన్ స్లాక్‌లూ... బొమ్మబొమ్మల బుష్ షర్టులూ... వాళ్ళ కళ్ళముందు తారట్లాడాయి. ఇక పెద్దవాళ్ళకు...'డ్రైక్లీనింగు' అంటే ఏమిటో దాని గొడవ తెలీకపోయినా... ఊళ్ళు తిరిగొచ్చిన రాముడు నగరంలోని తన అనుభవాలు వివరించి చెబుతూ మధ్యమధ్యన ఇంగ్లీషుపదాలు వాడేప్పటికి—వాడంటే గురికుదిరిపోయింది!..."ఏదో ఇక మీ అందరి పాదాలముందు కూర్చొని...తను పుట్టి పెరిగిన ఈ ఊళ్లోనే ఏదో మీకు తగిన సేవచేస్తూ... నా బతుకు నేను బతుకుతాను!" అని అన్న రాముడు మాటలు అందరి మనస్సుల్లోనూ పీఠం వేసుకపోయాయి.

ఇక రాముడికి దూరభారపు బంధువులంతా వాడి గొప్పతనాన్ని గురించి చెప్పి, ఊళ్ళోని కమ్మవారందరికీ మనవాడి మీద గురి కుదిరిందంటే మనందరి అదృష్టమని తేల్చి, వాడి నొక ఇంటివాణ్ణి చేయాలని తీర్మానించి, పిల్లను కూడా కుదిర్చారు. ఇక వాడు పట్టణం నుంచి రావటమే తరువాయి!

రెండో రోజు గడిచింది, మూడో రోజు కూడా గడుస్తోంది. మధ్యాహ్నం పూట... రాముడితో పాటు వెళ్ళిన ఇద్దరు కుర్రాళ్ళు... తూలుకుంటూ తూలుకుంటూ ఊళ్ళో ప్రవేశించారు. అట్లాగే వాళ్లు చెరువుగట్టుదాకా వచ్చి లైబ్రరీముందు నిలబడ్డారు! లైబ్రరీ వరండాలో కూర్చున్న వాళ్ళంతా బయటకొచ్చారు! వచ్చి- 'రాము డేడిరా? డ్రైక్లీనింగ్ సామానేదీ?' అని అడిగారు!

'రాముడా?... రాముడు తుర్రుమని ఎగిరిపోయాడు' అన్నాడుఒకడు.'కాదు కాదు!...నాలుగు బుడ్లు మా చేతి కందించి మరీ తుర్రుమన్నాడు!' అన్నాడు మరొకడు!

'ఎక్కడి కెళ్లాడు? ఎక్కడి కెళ్లాడు?' అన్నారు లైబ్రరీ వాళ్లంతా ఒక్కసారిగా!

"హైదరాబాద్... చార్‌మినార్... అలీబేగ్ డ్రైక్లీనింగ్ షాప్" అని గొణుక్కుంటూ వాళ్ళు ముందుకు సాగిపోయారు!

ఈ వార్త అందరిమీదా పిడుగులాగా పడింది. ఊళ్ళో వాళ్ళంతా ఒక్కసారిగా ఉగ్రులై పొయ్యారు! అప్పటి కప్పుడు డబ్బిచ్చి...ఇద్దరు బలమైన మనిష్యుల్ని హైద్రాబాదు పంపించారు—ఎక్కడ కన్పిస్తే అక్కడ పట్టుకుని పెడరెక్కలు విఱిచికట్టి తీసుకరమ్మని!

"ఇదుగో చూసుకోండి వాణ్ణి పట్టితెస్తాం" అని బయలుదేరిన బలశాలు లిద్దరూ మూడోరోజుకల్లా తిరిగొచ్చి—హైద్రాబాద్‌లో రాముడు కన్పించ లేదనీ చార్ మీనార్ దగ్గర...'అలీబేగ్ డ్రైక్లీనింగ్ షాప'నేది లేనే లేదనీ, అక్కడికి వంద గజాల దూరంలో పడమరదిశగా ఉన్నది నైజాం నవాబు తాత ముత్తాతల గోరీల మక్కామసీదని దిగాలుపడిన మొహంతో వివరించి చెప్పారు!

# ఆంతరికం

సంపత్కుమార

ఇపుడు నాస్థితి ఏమిటో ఏనె చెప్ప
లేను, లాంఛనమాత్ర సంధానితాత్మ
జీవిత ప్రత్యభిజ్ఞకై చేయుచున్న
నా నిరంతర వేదనాఫీనయాత్ర.

మద్వియద్గళమందు కంపద్వివిక్త
బహుపురావర్ణమేళన, ముహురనేక
విధుల కల్పితమై ఆత్మవేలలందు
విద్యుదంశములకు యౌగపద్య మొసగు.

అస్మదాంతరిక ప్రవృత్త్యాధిపత్య
మునకును బ్రతీకయైన గీతిని వినాక
రించి నేను నాతనమును బెంచుకొంట
యన్న దౌక అధ్రువమ్మైన ఆశయగును.

ఒకడు వెలిగెడు నవ్యక్త చకచకద్వి
భావనారేఖ శతశో విభక్తనేమి
యగుచు, కన్నుల జారు ననంతబాష్ప
కోష్ణపృషదంతరమ్ముల గుప్తమగుచు.

నాంతజనురనుషంగితమయి యెసంగు
నట్టులది హృత్తలమ్మునుబట్టి విడదు
తదమలిన విస్ఫురణకు నేతదనవరత
కల్పిత సమాధి ఆత్మకిక్కగ నొనర్తు.

ఇప్పుడు సమాధియన్నది తప్పరాని
దై విశంకట వృత్తికి తలుపుమూయు
ఇది తనెంతగ మార్చునో ఏమొ నన్ను
నన్ను నన్నుగ జేయ !

# కేతవరపు రామకోటిశాస్త్రి | విమర్శకులు - విమర్శనము

కొందర కనిపించవచ్చును. ఆ నలుగు రేనా యేమి దేశములో విమర్శకులని. ఆ లెక్కకు వచ్చినచో చాల కష్టము. దేశములోని కవుల పేర్లు నీవు చెప్పుము. పది చెప్పుదువు. నిజమున కా పది మందియే. కాదుగదా కవులు? నిజము ఆ నీకును తెలియును. తెలిసియును అట్లే చెప్పుదువు. ఏల? అవసరము వచ్చినది గనుక. కొందరిని చెప్ప వలయును గనుక. నీవట్లు చెప్పుటలో నున్న సబబేమి? ఆ పేర్లు ప్రసిద్ధములై యుండుట. కాక వారియందు నీకొక ప్రత్యయ ముండుట. ఆ ప్రసిద్ధి ఆ ప్రత్యయము - వాని స్వరూప స్వభావము లటుంచుము. ఇంతకును నీవా కవుల విషయమున చేసిన గణింపు నీవా పదిమందిని కవు లనుకొను చున్నా వనియే స్థాపింపగలదు గాని ఇక దేశములో కవులే లేరని స్థాపింపదు గదా? ప్రసిద్ధి సంగతి వేరు. అది చాల విధములుగ వచ్చును. నీకు వారి యందు ప్రత్యయ మెట్లేర్పడినది? నీవు కవిత్వ మనుకొను సామగ్రి వారియం దుండుటవలన నేర్పడినది. కొంచెము నిలువదీయబడి చెప్పవలసి వచ్చినపుడు అందే యిద్దరినో చెప్పుదువు. మరియు నిలువదీసినచో నందే యొకరినో చెప్పుదువు. నీవట్లు చెప్పుటలో నున్న రహస్య మేమనగా నీవనుకొన్న కవితా సామగ్రి ఉత్తరోత్తరముగా వారి వారియందు పుష్కలముగా నున్నదన్నమాట. అందువలన నట్లు చెప్పితివి. ఆనీయనుకొన్న కవితా సామగ్రి అసలు సామగ్రి యగునో కాదో దాని విషయము తరువాత. నేను నా మొదటి వ్యాసమున స్వతంత్రబుద్ధులైన విమర్శకు లానలుగురని పేర్కొనుట లోని యాంతర్య మిపుడు స్పష్టపడియుండును.

ప్రశ్నకు తిరిగి ప్రశ్న వేసినట్లున్న దన్నచో నసలు విషయ మిది. విమర్శనము యొక్క స్వరూప భావము లా నలుగురకిని గట్టిగా తెలియును. తెలియునని వారి విమర్శనలు చదివిన తెలియును. కావ్య స్వరూపమును వారు భావించిన తీరునుబట్టి తెలియును. "కథ - పాత్రములు - ప్రకృతి విశేషములు - వర్ణనములు - ఇవన్నియు పరస్పర మైత్రి కలిగి విఱుపులులేని యేకాకృతి" గా నుండుట అనగా "అంగాంగ సాంగత్యము కావ్యముల శ్రేష్ఠ" మని రామలింగారెడ్డిగారి నిష్కర్ష. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారును "కావ్యమునకు జీవనము రసము" గనుక ప్రసక్తములైన భావము లన్నియు "ప్రకృత రసముతో సంబంధము" కలిగి యుండుననియు, నుండవలయుననియు వ్రాసిరి. నండూరి బంగారయ్యగారు కావ్యమున, కవి "ప్రతిష్ఠింపదలచుకొనిన పరమార్థ మేమి అను ప్రశ్నకు మున్ముందు మనము సమాధానము బడయ వలయును" అన్న దృష్టిగలవారు. విశ్వనాథ సత్యనారాయణ గారి నిశ్చయము "కావ్యమున పరమమైన విషయము ఏక వాక్యత. అది నిర్మాణ కౌశల్యముచేత ఒక విలక్షణమైన శిల్పమును సంపాదించుట చేత కల్గును" అని—. మరియు నా నల్గురను ఆ క్రమములో పేర్కొనుటలో నొక యుద్దేశ మున్నది. మొదటి యిద్ద రొకటి. చివరి యిద్దరు నొకటి. ఒకటి యనుటలో తాత్పర్యము ఈ వ్యాసముల చివరకు స్పష్టముకాగలదు. ఇచట నింకొక ప్రశ్న వేయవచ్చును. ఆనలుగురు కావ్య స్వరూపమును భావించిన తీరు కేవలము క్రొత్తదిగాని, పరస్పర మంత భిన్నమైనది గాని కాదుగదా యని.

కాదు గాని వారి విమర్శనము లేతన్మార్గమును బట్టుటలో నున్నది. నేడు దేశములో విమర్శకు లనబడు చాలమందిలో నున్న లోపము కావ్య స్వరూపము తెలియకపోవుటగాదు. విమర్శనము వ్రాయ ప్రారంభించు సమయమునకా తెలిసినది తెలియనట్లుగా నై పోవుట. అట్లయిపోయినవారి బహు వ్యాసములు - బహు గ్రంథములు విమర్శన ములుగా నేడు చలామణిలో నున్నవి. వాని సంఖ్యయు తక్కువది కాదు. అందువలన చాలమంది విమర్శకు లున్న ట్లొక భ్రాంతి వ్యాపించియున్నది. ఆ భ్రాంతియే నిజమైనచో తెలుగుదేశములోని ప్రతివాడును విమర్శకుడే యగును. అది వట్టి భ్రాంతి యన్న ప్రగాఢమైన విశ్వాసము కలవాడ నగుటచేత, నా బుద్ధికందినంతవరకు విమర్శనమనగా ఫలానా అని అనుకొన్న వాడ నగుటచేత, అది వారి యందున్న లక్షణమగుటచేత, ఆ నలుగురను పేర్కొంటిని.

కావ్యము అంగాంగసాంగత్యముగల ఏకాకృతి యన్నను - ఏకరసముతో నుండునన్నను - ఒక పర మార్థముతో నుండునన్నను - ఏకవాక్యత కలిగి యుండునన్నను - ఒకటే. అనగా నేక తాత్పర్యము నందు బుద్ధిగలవియే నన్నమాట. తాత్పర్య మొక టియే యైనను వారివారి బుద్ధుల పటుత్వమును బట్టి వ్యాఖ్యానము కొంతకొంత మేరలవరకే పరి మితమైనది. ముందా తాత్పర్యము యొక్క చరమసీమ యేమో చెప్పెదను. ఏకవాక్యత యన్న దాని స్వరూపస్వభావములు చెప్పినచో సర్వమును చెప్పినట్లే యగును. ఏకవాక్యతయనగా వాక్యైక వాక్యత యన్నమాట. అనగా - కొన్ని వాక్యము లుండును. వాటి యర్థములు వాటికుండును. ఉండియు పరస్పరము మరలమరల అంగాంగి భావాకాంక్షావశమున సమాహారస్వరూపమున నుండు నొక యర్థమును బోధించుటకు సమర్థ ములై యుండును. అనగా ఏకవాక్యత కొదిగి యున్నవని. అట్లొదిగియున్న వాక్యముల మొత్తము నకు మహావాక్యమని పేరు. ఈ మహావాక్యార్థ జ్ఞాన మెట్లు కలుగును? అవాంతర వాక్యార్థముల పర్యాలోచనముచేత కలుగును. ఈపర్యాలోచనము యొక్క ప్రారంభము పదమునుండి. ఏల? పదో చ్చయము వాక్యమగుటవలన. మరియు ఘాటాడి నచో ఆ పదముల కేర్పడుటకైన ప్రకృతి ప్రత్యయ రూపావయవములందున్న అర్థబోధక శక్తినుండి ప్రారంభము. అనగా పదముయొక్క రూఢ్యర్థము నుండి యౌగికార్థమునుండి ఆకాంక్షాయోగ్యతల ననుసరించి వాక్యమునుండి వాక్యమునకుగా అంగాంగి పరిశీలనము ద్వారా మహార్థరూపఫలమున కభిముఖమై చేయు సాధనమంతయు పర్యాలోచన మన్నమాట. ఆ మహార్థప్రతీతి కుపస్కారకమై ఆ వాక్యముల మొత్తమందున్న యెడతెగనితనము నకు ఏకవాక్యతయని పేరు. రామలింగారెడ్డిగారి అంగాంగ సాంగత్యముతోడి ఏకాకృతికిని ఏక వాక్యతకును కించిత్తు భేదమున్నది. అది తరువాత. పరమార్థము - మహార్థము - అఖండార్థము - ఏక వాక్యత - ఇవన్నియును సమానార్థకములు. ఆ ఏకవాక్యత - ఆ పరమార్థము - ఎవనికి స్ఫురించును? వ్యుత్పన్నునకు స్ఫురించును. వ్యుత్పన్నత యనగా పదమునకున్న అర్థ బోధక శక్తిలోని రహస్యము నెరుగగలిగిన తెలివి. ఈ తెలివి యొక్క కలిమియే సర్వ భారతీయ వాఙ్మయ సృష్టిలోనున్న పరమ మైన విషయము. అది సంప్రదాయము.

రామాయణ, మహాభారత, రఘువంశాదికము లను లాక్షణికుడు మహావాక్యములుగా పేర్కొ నెను. ఆయన సంప్రదాయము నెరిగినవాడు. మరియు నందు నిష్ఠకలవాడు. ఒక గ్రంథము నంతయు కలిపి మహావాక్య మనుటలో నొక ఆంతర్యమున్నది. అది ఆ గ్రంథమును విమర్శించి చదువుకొను మార్గము—ఆకాంక్షా యోగ్యతా సత్తిమత్పదసముదాయము గదా వాక్యము. ఒక పదమునకు వేరొక పదముతోనున్న సమభి వ్యాహారమున కాకాంక్షయని పేరు. అనగా

ఆ పదము లట్లు అన్యోన్యాన్వయముచేత నొక యర్థమును బోధించుట నాకాంక్షించుచున్న వన్న మాట. అనగా ఇచ్ఛించుచున్నవని. ఇచ్ఛ చేతన యొక్క ధర్మము. ఒక విధముగా పదము జడము. జడమైన పదమున కిచ్ఛ సంభవింపదు గనుక ఆ పదములను అట్లు అన్యోన్యాన్వయము కలవిగా సంధించిన పురుషున కున్నదన్నమాట. ఆ పురుషు డా యర్థమును బోధించు నిచ్ఛతో నా పదముల నట్లు కూర్చినపుడు మరొకడు ఆ యర్థ మా పదముల వలన ఎట్లు వచ్చుచున్నదో అని విచారించును. కూర్చువాని కెట్టి యిచ్ఛయున్నదో గ్రహించు వానికిని అట్టి యిచ్ఛ యుండవలయును. ఆ మొదటివాడు కవియైనచో నీ మరొకడు విమర్శకుడు. ఆ యిచ్ఛ వాని తాత్పర్యమునకు మూలము. ఈ యిచ్ఛ వీని తాత్పర్యమునకు మూలము. తాత్పర్యమనగా నభిప్రాయమని రెండవ వ్యాసమున వ్రాసితిని. అది ద్విధాభూతము. వక్తృ తాత్పర్యమనియును శబ్దతాత్పర్యమనియును. వక్తృ తాత్పర్యము కవిది. శబ్ద తాత్పర్యము విమర్శకునిది. ఈ శబ్దమువలన పాఠకునకు - లేక శ్రోతకు - లేక ప్రేక్షకునకు - ఈ యర్థముయొక్క బోధ కలుగవలయునన్న (వక్త) కవియొక్క యిచ్ఛావిశేషమే వక్తృ తాత్పర్యము. తదర్థ ప్రతీతిజననయోగ్యత్వము శబ్ద తాత్పర్యము. కవి యొక శబ్దముద్వారా తన యర్థము నభివ్యక్తము చేయగా విమర్శకు డా శబ్దముయొక్క యోగ్యత తనకెంత తెలియునో అంతలో తదర్థమును గ్రహించుచున్నాడు. కవి యర్థమును బట్టుకొని శబ్దమును గ్రహించగా, విమర్శకుడు శబ్దమును బట్టుకొని యర్థమును గ్రహించుచున్నాడు. రమణీయార్థ ప్రతిపాదక శబ్దము కావ్యముగా పేర్కొనిన లాక్షణికునకు తెలిసిన బహు రహస్యములలో నిది యొకటి. మరియు నందు కవియొక్కయు, విమర్శకునియొక్కయు దృష్టియు దేనియందు బద్ధములై యున్నవో - ఉండవలయునో, చెప్పట యున్నది. రమణీయమైన యర్థమును శబ్దము ద్వారా కావ్యమున ప్రతిపాదించువాడు కవి. కావ్యమునందు శబ్దము ద్వారా ప్రతిపాదింపబడిన రమణీయమైన యర్థమును గుర్తించువాడు విమర్శకుడు. ఇరువుర దృష్టియు రమణీయమైన యర్థమునందే యున్నది. తత్ప్రతిపాదనమునకు - తద్గ్రహణమునకును శబ్దము సాధనము. నా రెండవ వ్యాసమున అఖండార్థముయొక్క చారుత్వాతిశయమని వ్రాసినదీ రమణీయార్థము నుద్దేశించియే. దీనినే ఆనందవర్ధనుడు చారుత్వాతిశయముతోడి విశిష్టార్థ మనెను. అనగా దండియొక్క కేవల ఇష్టార్థము కాదన్నమాట. ఇష్టార్థమునకును పై యర్థమే చెప్పుకొనుట వేరువిషయము. ఆ శబ్దమంత రమణీయార్థమిచ్చుటకు దాని కున్న శక్తిని బట్టి విచారించువాడు విమర్శకుడు. లాక్షణికుడు శబ్దమని యేకవచనము నుపయోగించుటలోని రహస్యమేమనగా కవి తన యర్థమును చెప్పుటకు దాని నుండి ప్రారంభించును. విమర్శకు డా యర్థమును గ్రహించుటయు దానినుండే ప్రారంభించును అని. సాహిత్య రహస్య మర్మజ్ఞులైన లాక్షణికులు కావ్యము యొక్క గుణదోష విచారణమును శబ్దమునుండి ప్రారంభించుట గమనింపదగినది. మరియు కొందరు మేధావులు శబ్దాంశములనుండి ప్రారంభించిరి. ఇంతకును చెప్పవచ్చిన దేమనగా కావ్య నిర్మాణము గాని తద్విమర్శనము గాని శబ్దము పునాదిగా బయలుదేరుచున్నదని కావ్యార్థమును గ్రహించుట కితఃపూర్వము చెప్పబడిన అంత పర్యాలోచనము చేయవలయును. అందువల్లనే అది ఆలోచనామృత మనబడినది. సద్యఃపర నిర్వృతి యనగా ఏవంవిధమైన పర్యాలోచన జరిగిన తత్క్షణమని యర్థము గాని, నీవు చదువుచున్న తత్క్షణమని గాదు. అదియును చేయలేక ఆ కవియే వచ్చి చదువుటను పెట్టి నీవు వినుచున్న తత్క్షణమే యని గాదు. ఇచట జరుగునది వట్టి తలయూపుట. సద్యఃపరనిర్వృతి యన్నది తలయూపు గాదు—ఒక విశేషము. సహృదయ

లనబడు కావ్యానందము ననుసరించు వారి యత్నం యొక్క ప్రారంభము గూడ శబ్దమునుండియే. కాని వానికిని విమర్శనకును భేద మెచటనున్న దనగా ఆ శబ్దార్థముల సంబద్ధతను అఖండార్థ ప్రతీతి వరకు లాగికొనిపోవుటలో నున్నది. అట్లు చేయుటలో తన చేతయం దన్యునకు నిశ్చయము కుదురుటకు గాను తద్ధర్మమును అనగా శబ్దార్థముల సంబద్ధతను నిర్ణయము చేసికొనుచుపోవును, పోవలయును. దీనినే నా మొదటి వ్యాసమున విమర్శకుని లక్షణములలో నొకటిగా ధర్మనిర్ణయాధికారమని చెప్పినాను. ధర్మ నిర్ణయాధికార మనగా అట్టిది అదేదో దాష్టికము చెలాయించుటవంటిదనుకొనుట కూడదు.

ఒక గ్రంథము నంతయును మహావాక్య మనుట వలన, మహా వాక్యార్థ జ్ఞాన మెట్లు అవాంతర వాక్యార్థముల జ్ఞానము వలన జన్యమో, అట్లే ఆ గ్రంథము నందలి యఖండార్థమును- అందలి కథ- కథలోని పాత్రములు- పాత్రముల కదలిక వలన కథసాగువిధము - పాత్రము లేతన్మార్గమున సాగుటకైన మనోలక్షణము- సంఘటనములు - ఇత్యాదులన్నింటి యొక్క సుష్ఠుపర్యాలోచనము చేత కలుగునని చెప్పుటయగుచున్నది. ఆ పరమార్థమున కవి యన్నియు ఉపస్కారకము లెట్లయినవో వ్యాఖ్యానాత్మక మీమాంస చేయుటయే విమర్శనము. ఈపరమార్థమునకు సంబంధించిన మరియొక అంశము నండూరి బంగారయ్య గారిని గూర్చి వ్రాయునపుడు చెప్పబడును.

కావ్యము కథాశ్రయము. ఉన్న కథలన్నియు ఉన్నట్లుగా కావ్యకథలు కాజాలవు. అవన్నియు కేవలము కథలు. కావ్యకథ రసాత్మకము. రస స్వరూపము చమత్కారమైనది. రసము కిన్నిష్ఠమన్న ప్రశ్నకు నే నీనాడు సమాధానము వ్రాయనక్కర లేదు. రసము అనుభవనిష్ఠము. అనుభవమనగానేమి? భావనాత్మక సంస్కారజన్యమైన జ్ఞానము. భావన యనగా అనుభవముచేత జన్యమై తిరిగి ప తదను భావమును చర్వణము చేయగల సంస్కారము. తజ్జన్య మనుభవము. తన్నిష్ఠము రసము. అనగా నొక కావ్యమును చదివినపుడు కలిగిన యనుభవమును చర్వణముచేయుట వలన కలిగెడు ఒకానొక జ్ఞానమునకు రసమని పేరు. దానికే పరమార్థమనియును పేరు. పరమమైన యా జ్ఞానమున యోగి లీనమైనట్లు సహృదయు డా కావ్యరసమున లీనమగును. ఆ యోగికి పునరావృత్తి లేదుగనుక వాని లీనమగుట బ్రహ్మానందమునుపొందుటయైనది. పునరావృత్తి కలిమిని సహృదయుని యీ లీనమగుట తత్సహోదరమైనది. ఆ పరమమైన జ్ఞానమును పొందుటకున్న మార్గముల మీమాంస దర్శనములు కాగా, ఈ రసరూప పరమార్థమును పొందుట కుపస్కారకములైన కావ్యగత సర్వ విషయముల మీమాంసయును విమర్శనమైనది.

మన భారతీయాలంకారికుల రచనలన్నియును వారి వారి కావ్యములు చదువుటవలని యనుభవమును తిరిగి భావన చేయుటయందు-అనగా చర్వ చేయుటయందు జరిగిన ప్రపంచనమువలన నైనవి. మరియు నందున్న చమత్కారమేమనగా నవి శాసనములవలె మీరరానివన్నట్లు కనుపించుట, అనగా వారి యనుభవమంత తీవ్రమైనదన్నమాట. తను తమ భావనలోని వివేకమునందు వారి కంత గట్టి విశ్వాసమున్నదన్నమాట. ఆత్మ విశ్వాసము తన యోగ్యతను తాను తెలిసికొన్న తెలివి. అది మానవుని పరమమైన లక్షణము. కనీసము లక్షణములలో నొకటి. ఆత్మ విశ్వాసముగలవారి వ్రాతలలోనుండు జీవము తోడి తీవ్రత అది లేనివారలలో నుండదు.

రామలింగారెడ్డిగారు స్వతంత్ర బుద్ధిగల విమర్శకులంటిని, స్వతంత్రబుద్ధియన నేమో కొంత రెండవ వ్యాసమున వ్రాసితిని. వివేకముతోడి యొక సాహసమును స్వతంత్ర బుద్ధి చేయును. రామలింగారెడ్డిగారి వివేకము పూర్తిగా దేశీయమైనది కాదు. అసలు వివేకమనగా శ్రుతిస్మృతి

యుక్తులతో ధ్యేయమును పొందుటకు చేయు విచారణము. ఇచట పూర్వాలంకారిక లక్షణ శాస్త్రములని వివక్ష, పూర్తిగా దేశీయము కాకపోవుటవల్లనే కావ్యము పట్టి కథయొక్క అంగాంగసాంగత్యములతోడి యేకాకృతిగానే ఆయన తెలిసికొనెను. అందువలన కథాసంబంధి స్థూలమైన యౌచిత్యమునే ఆయన విచారించెను. మన సాహిత్యముయొక్క సూక్ష్మ విచారణమునకు కావలసిని సామగ్రి దేశీయమైన సంప్రదాయజ్ఞతలోనున్నది. అది లేదాయనకు. కనుకనే ఆయన చేసిన పింగళి సూరన్నను గూర్చిన విమర్శనములో కేవలకథలయొక్క స్థూలమైన పొసగియుండుటలోని ఔచిత్యముయొక్క విచారణ మాత్రమేయున్నది. ఆయా గ్రంథముల నాసూరన్న యే యుద్దేశముతో వ్రాసెను? అందే రసము ప్రధానము? అంగరసములు తదుపస్కారకములుగానుండి కవి యాశించిన పరమార్థ సాధనములగుచున్నవా? అవి మొదలు ప్రబంధములా? కావ్యములా? ఇత్యాది ప్రశ్నములకు సమాధానము రామలింగారెడ్డిగారి విమర్శనములో నుండదు. లేదు. వివేకమనగా యుక్తులతో చేయు విచారణయనిగదా వ్రాసితిని. సూక్ష్మముగా విచారించినచో యుక్తులు రెండు విధములు. బుద్ధిజన్యములనియును, శాస్త్రజన్యములనియును. బుద్ధికి శాస్త్రము బలమునిచ్చు గుణముకలది. రామలింగారెడ్డిగారి బుద్ధి పాశ్చాత్య శాస్త్రవాసన అధికము గలది. మరియునందు నిష్ఠకలది. ఆయన వివేకము కలిమి పాశ్చాత్యము. సాహసమున్నది గనుక నొకటి రెండు తప్పటడుగులు పడుట కూడ సామాన్యము. సామాన్యమన్నది కాపుదల మాట. సాహసవంతులందరును తప్పటడుగులు వేయకపోవచ్చును. కనీసము వేయనట్లు కనిపింపవచ్చును - రామలింగారెడ్డిగారికి పూర్వము దేశమున విమర్శనమెట్లున్నది?.... "వాటిలో అంతా పొగడ్తే. ఆ పొగడ్త కూడా కార్యకారణ భావము లేకుండ జరుగుతూవుండేది. ఎప్పుడూ ఉత్తమశబ్దాలే గాని పరీక్ష లేదు. భాషాంతరీకరణాలైతే సంస్కృతానికీ తెనుగుకూ తారతమ్య చర్చ వీటిలో కొంత ఉండేది. పండితులలో గర్భశైత్యాలు. అందుచేత రంధ్రాన్వేషణము ప్రధానముగాఉండేది.... విమర్శకుల పాండిత్య ప్రకర్షే పరమావధి. సానుభూతి అనేదే లేదు... వ్యాకరణ దోషాలు చూపటము విమర్శకుడి ముఖ్య విధి అని వీరి అభిప్రాయము. కృతిలో రసము చూపించి, దాని ప్రాశస్త్యాన్ని చెప్పటము వాళ్ళ కర్తవ్యము వలె వారికి తోచనే లేదు... రంధ్రాన్వేషణమే విమర్శనమనీ, భాషే విమర్శనీయాంశమనీ వీటి పరమావధి" ఇట్లున్నది. ఉన్నదని చెప్పినది నాటి స్థితిని ప్రత్యక్షముగానెరిగిన శ్రీకురుగంటి సీతారామభట్టాచార్యులవారు. కావ్యవిమర్శనమనగా కావ్యములోని కథ, పాత్రములు - వర్ణనలు - అన్నింటిని చుట్టుకొని యౌచిత్యము వీటియొక్క పరిశీలనమని మొట్టమొదట తోచినది రామలింగారెడ్డిగారికి. కథను గురించి నా వ్రాసినపై సంగతి ప్రతి భాష యందలి కథకును వర్తించును. ఆంగ్లభాషా కావ్యములలోని కథలట్లు వారిచేత పరామర్శింపబడుచుండగా నీ దేశమున ఆంధ్రగ్రంథము లట్లు పరామర్శించుట యుచితముగదా యని ఆయన పూనుకొనెను. ఆయనకు కథయొక్క పొసగింపొకటియే తోచినదిగాని సాహిత్యప్రక్రియా వైవిధ్యమునుబట్టి కథాగ్రథనము భిన్నమార్గముల బట్టి యుండునని తోచలేదు. ఆ తోచకపోవుటకు హేతువు భారతీయ ధర్మమునందును, దానిబట్టి మన యాచారవ్యవహారము లందును, లక్షణగ్రంథముల యందును ప్రత్యయ బుద్ధి లేకపోవుట. ఈ లేకపోవుటకు హేతు వాయన చదివిన చదువు. అది మన సంప్రదాయమును చెప్పనిది. మన నాగరకతను చెప్పనిది. చెప్పకపోవుట దాని దోషము కాదు. మన, యిప్పుడు వెనుకబట్టిన, చదువు తద్భాషా భాషీయుల సంప్రదాయమును నాగరకతను చెప్పుచున్నదాయేమి? రామలింగారెడ్డిగారు తాము చదివిన చదువువలని తమ తాత్పర్యమును

వినియోగించి తాము చదువని చదువు తమదైన దన్న మమకారముతో చూడగా కొంత సవ్యముగను, కొంత అపసవ్యముగను కనిపించినది. కనిపించినది కనిపించినట్లాయన వ్రాసెను. అది కవిత్వ తత్వ విచారమైనది. ఆయనకు తెనుగు భాషయందున్న మమకారమునకీ యొక వాక్యము చాలును. "మావంశమున కేదివచ్చినను రానిండు. తెనుగుభాష యొక్కటి మాత్ర మక్షయముగ నిలిచియుండిన జాలును." ఇది నీవంటివాడు నా వంటివా డనలేనిమాట తెలుగుభాషను చాలమంది కీర్తించినారు. తిరిగి ఈ దేశములోపుట్టి ఈభాషనే మాటాడవలయునని యున్నదని యొకాయన వ్రాసికొన్నాడు కూడ. మా వంశమున కేది వచ్చినను రానిండు అని రామలింగారెడ్డిగారే యనగల రేమో!

ఆయన తెనుగుదేశములోని మొదటి విమర్శకుడు. కథా పరిశీలన మార్గము నాయన మొదటి సారిగా నొక గ్రంథము తీసికొని ప్రారంభించుట వలన నాయన మొదటి విమర్శకుడు ఈనాడు కావ్య విమర్శనమున కథాకథనగ్రథన శిల్పములు పరామృష్టము లగుచున్నవనగా నర్థము రామలింగారెడ్డిగారు దానికి మూలము. అందువల్ల ఆయన మొదటి విమర్శకుడు.

రామలింగారెడ్డిగారు ప్రధానముగా విమర్శించినది పింగళి సూరన్నగారి కళాపూర్ణోదయమును, ప్రభావతీ ప్రద్యుమ్నమును. గ్రంథములను విమర్శించు సందర్భమునను, తత్పూర్వమునను కావ్య స్వరూప స్వభావములను గూర్చిన కొన్ని సిద్ధాంతముల వంటి యభిప్రాయములను స్థాపించెను. వివరించెను - ఆయన సాహిత్యసంబంధివివేకము పూర్తిగా దేశీయముకాదని వెనుక మనవిచేసినాను. ఇతిహాసము - పురాణము - కావ్యము - ప్రబంధము ఇత్యాది ప్రక్రియా వైవిధ్య మాయనకు తెలియదు. కావ్య ప్రభేదములని ఆలంకారికులు స్పృశింపక పోలేదు. రామలింగారెడ్డిగారి కీవిషయ మట్టె తెలియదు. తెలిసినను నిష్ఠ కుదురని తెలియుట. ఇతిహాస పురాణాదు లన్నింటియందును ఏదో కథ యుండునని తెలియునే గాని ఆ వాని యందుండు అంతర్భేదములు తెలియవు.

నేటికిని చాల మందికి తెలియదు. ఈ తెలియక పోవుటకు హేతు వేమనగా, కావ్య స్వరూపస్వభావాలను చర్చించి సిద్ధాంతీకరించినట్లు మిగిలిన ప్రక్రియలను గూర్చి ఆలంకారికులు చేయలేదు. కొంత సూక్ష్మముగా నాలోచించినచో, కావ్య స్వరూప స్వభావాలను గూర్చి చేసిన చర్చయొక్క పరిధి చాల విస్తృతమగుటవల్ల అందివి యన్నియు నొక విధముగా నంతర్భవించినట్లే తోచును. కాని యా తోచుటతో పురాణేతిహాసాది ప్రక్రియలలోని అవాంతర భేదమును గుర్తించుటకు స్వయంకుశలమైన బుద్ధి యుండవలయును. రామలింగారెడ్డిగారి బుద్ధి స్వయంకుశలమైనదైనను సాంప్రదాయికమైన ఆలంకారిక మార్గముయొక్క ఆంతర్యము నెరుగుటకు తగిన చదువును నిష్ఠయు ఆయనకు లేవు. మిగిలిన ఆ చదువు చదువుకొన్న చాలమందికి స్వయంకుశలమైన బుద్ధియు నిష్ఠయు లేవు. అందువల్ల వ్రాసితిని నేటికిని చాల మందికి తెలియదని. చాలమంది కనుటవలన ఇద్దరు ముగ్గు రుండుటకు బాధ లేదు. పురాణములలో రసముండదు. ఇతిహాసములలో రసముండును. మాటిమాటికి విచ్ఛిత్తిని పొంది - విస్తృతమైన మహాకథ మీద పరచబడి పలుచపలుచగా స్థాయి నందికొని యుండును. కావ్యములలో రసమునకు సాంద్రత యెక్కువ ప్రబంధములలో రసగతి ఇరుకుబాటను బట్టినది - ఇక వాటిలో కథలు తత్తదనుగుణముగా నుండును. ఇచట నా యీ ప్రక్రియలను గూర్చి విపులముగా వ్రాయబడదు.

రామలింగారెడ్డిగారు ప్రబంధములను పూర్తిగా నిరసించెను. నిరసించినట్లు కనిపించును. కనిపించుట యేమి? ఏమనగా మనుచరిత్రము - ఆముక్తమాల్యద - పారిజాతాపహరణము - కాళహస్తీ

శ్వర మాహాత్మ్యము - విజయ విలాసము - వసు చరిత్రము - ఇత్యాదుల నాయన నవ్యతయన్న గుణము కలవిగా చెప్పెను. ఆయన చేసిన పొరపాటంతయు ఫలానా ఫలానా ప్రబంధములు గుణము లేని వనుటకు బదులు మొత్తము ప్రబంధ ప్రక్రియకే యెసరుపెట్టినట్లు వ్రాసెను. ఈ వ్రాతను విస్తరించి చూపిన ట్లాయా నవ్యతయన్నగుణము కలవిగా చెప్పిన గ్రంథముల విషయమున వ్రాయలేదు. రెడ్డిగారు మొత్తము ప్రబంధముల మీద నారోపించిన దోషములు మూడు. (1) కథలు భిన్నభిన్నములై వేనికవి అనన్యమై యుండలేదని. (2) ప్రబంధములలో నాటకసరణి మృగ్యమని (3) రచనలలో బింబ ప్రతిబింబము లధికమని. ఈ మూడవదట్లుంచుము. ఆయన పాత్రముల విషయమున చెప్పిన దోషము లన్నియు గాకపోయినను. కొన్ని కథా సంబంధి దోషములో లీనమగునవియే. ప్రబంధములో రసము ఇరుకు బాటను బట్టి యుండునంటిని. అనగా అందలి కథయు నట్లే. ఈ విషయ మాయన గూడ గమనించెను. "ప్రబంధములలో కథ ముఖ్యముగాదు. మఱి వర్ణనల కవకాశమబ్బుటకై తెచ్చిపెట్టుకొన్న నెపము" గమనించియు కథా ప్రాధాన్యమున యందు బుద్ధి నిలుపుటతో వ్యవహారము తల్లక్రిందులైనది. రసము కథాశ్రయము. కథయే అప్రధానమైనపుడు రసమును అంతే. అసలైన ప్రబంధమును వ్రాసినది రామరాజభూషణుడు. ఆయన వలె ప్రబంధమును వ్రాయుటకు కావలసిన ధీశక్తి తరువాతివారిలో లేదు. కనుకనే రామలింగారెడ్డిగారు చెప్పిన ట్లన్నింటియందును కథాసారాంశ మొకటియేయై రచనలోను బింబ ప్రతిబింబ దోష మధికమైనది. రెడ్డిగారు నవ్యత యన్న గుణమున్నదిగా చెప్పిన మనుచరిత్రము - పారిజాతాపహరణము - విజయ విలాసము కథా ప్రాధాన్యముతో సాగినవే. మనుచరిత్రమునందున్న అఖండార్థ ప్రతీతిలోని చారుత్వాతిశయమా మిగిలిన రెండింటి యందును లేకపోవుట వేరువిషయము.

కాళహస్తీశ్వర మాహాత్మ్యమును అనేకోపకథలతో రసమును ప్రధానముచేసికొనకయు, తదీశ్వర మాహాత్మ్యసంస్థాపనమన్న ఏకవాక్యతను సాధించుకొన్నది. సూక్ష్మముగా విచారించినచో నిది కావ్యము గాదు, ప్రబంథమును గాదు. ఇది వేరైన ప్రక్రియ. ఆముక్తమాల్యదయందలి కథ సమన్వయింపబడి వైష్ణవ పారమ్యమును చెప్పునది యయ్యును కేవల రచనను బట్టి యది ప్రబంధము.

నిజమునకు రామలింగారెడ్డిగారు నిరసించిన ప్రబంధములు వసుచరిత్రము తరువాత వచ్చిన అప్రతిభులయు, అకవులయు నకలుగ్రంథములను. ఆ విషయమున వివాదమేలేదు. కాని చిక్కెక్కడ వచ్చినదనగా కొట్టవచ్చినట్లాయన ప్రబంధ కవిత్వమునే నిరసించుటలో వచ్చినది. నిరసించినట్లు కనిపించుటలో వచ్చినది. అదియును గాక ప్రబంధకవులనగా పెద్దనాదులనియు, ఆ యుగమే మహోజ్వలమైనదనియు దేశమున ప్రచార ముండుట వలన అవిచారశీలురైన అకాయి పోకాయి సాహిత్యకులీనాడు మనుచరిత్రాది ప్రబంధాలు బూజుకొంపలని త్రోసివేసి విలువగలుగుటకా రెడ్డిగారి వ్రాత బలమునిచ్చుచున్నది. సంప్రదాయము తెలియక, భారతీయ ధర్మాధ్వమునందు బుద్ధి కుదురక, పురాణేతిహాస స్వరూప స్వభావాదు లెరుగక, భారత రామాయణాది గ్రంథముల విషయమున ఆయన వెలిబుచ్చిన అభిప్రాయముల ఫలిత మీనాటికిని దేశమునన్నది. భారతమున కౌరవ పాండవుల యుద్ధంతమే యెడతెగక యుండవలయును గాని మధ్య మధ్య అన్ని యుపకథ లుండరాదని ఆయన యూహ. మరియు నవ్వి ధర్మోపన్యాసములుగా నుండరాదని ధర్మాధర్మ విచారశీలము కలిమిని మహర్షుల వలన, భీష్ముని వలన చాల కథలను విన గోరుటను బట్టి "ధర్మరాజు శుద్ధముగ వదరుబోతు" అని రెడ్డిగారి నిశ్చయము. ఈ రకము తొందరపడి వ్రాసిన వ్రాతలు సంప్రదాయానభిజ్ఞులైన దేశీయులకు చాలమందికి పూర్వాంధ్ర కవిత్వముపట్ల నొక చులకన భావము కల్గించినవి.

రామలింగారెడ్డిగారు కళా పూర్ణోదయమును, ప్రభావతీ ప్రద్యుమ్నమును విమర్శించినారుగదా! ఆ విమర్శనములు స్వయం సంపూర్ణములా? కొంత వరకు స్వయం సంపూర్ణములే అయ్యు సమగ్ర స్ఫూర్తిగలవిగావు. దీనికి కారణ మాయన మొదలు కావ్యమును భావించిన తీరు. వెనుక ఏకాకృతి యన్న దానికిని - ఏక వాక్యతదానికి యని కించిత్తు భేద మున్న దని వ్రాసితిని. అదేమనగా వట్టి కథా నిర్మాణ మాత్ర కుశలత ఏకాకృతిని సాధించును. దీనితోపాటు దీనినిమించి ఒక పరమార్థ... సాధనమున దృష్టియుంచి చేయు రచనమే ఏక వాక్యతను సాధింపగలదు. ఒక కవి వ్రాసిన గ్రంథములోని కథ అంతయు నెట్లు పొసగియున్నదని చూచుట వేరు. ఆ కవి ఆ గ్రంథములో నా కథ నట్లు పొసగించి ఏ పరమార్థమును సాధించినాడని చూచుట వేరు. రామలింగారెడ్డిగారి విమర్శనము యొక్క పరిధి వట్టి స్థూలమైన కథయొక్క పొసగి యుండుటకే పరిమితము. మరియును రామలింగారెడ్డిగారి కళా పూర్ణోదయ విమర్శనమును బట్టి కావ్యమునందలి కథ కొక వైచిత్ర్యము తప్పక యుండవలయుననియు అదే ప్రధానమైనదనియు, ఆయన భావించినట్లూహింపనగుచున్నది. ఆయన షష్ఠాశ్వాసము 189 పద్యమునుండి తరువాతి రెండాశ్వాసములను మొత్తముమీద నిరసించెను. అవి లేనందున కథకు వచ్చు నష్టమేమియు లేదనియును వ్రాసెను. నిజమునకా మిగిలిన గ్రంథమంతయు మధురలాలసాకళాపూర్ణుల ప్రణయోదంతము. అందులో కళా పూర్ణుని దండయాత్రలు. కథ యింతగా సామాన్యమైన దైనను సూరన్న ఈ కథ యిట్లు సాగుటకు బీజమును రామలింగారెడ్డిగారు సూచించిన ఆ 189 పద్యమునందే నిక్షేపించినాడు. ఆపద్యములో నున్నదేమనగా సత్వదాత్ముడు మధుర లాలసను "ఇది నానా భూనాథవధూ మౌళిమణీ నిర్మిత నూపురార్చనీయాంఘ్రిసుమీ" అని అనుట. ఈ విషయమునే సూరన్నగారు సప్తమాశ్వాసము 240, 248, 275 పద్యములందును, అష్టమాశ్వాసము 21, 47, 135, 152 పద్యములందును మరల మరల తిరుగదోడుచు పోవును. అందువలననే కథ సాగుచున్నట్లు నిరూపించుటకు చాల యత్నము చేసెను. ఎంత యత్నము చేసినను ఆ కథాసంవిధానము అంతకు పూర్వమున్న దానివలె అత్యపూర్వము మాత్రము గాదు. అష్టమాశ్వాసమునందలి సత్వదాత్ముని వృత్తాంతము (59 పద్యములు) తప్ప వైచిత్రి గల కథయే తరువాత లేదు. మరియును రామలింగారెడ్డిగారు భావన యనగా వట్టి కథాసంవిధాన వైచిత్రి యను కొనుట వల్లనే ఈ షష్ఠాశ్వాసము తరువాతి భాగముతో పాటు ప్రభావతీప్రద్యుమ్నమునను భావనాశక్తి లేదని వ్రాసినారు. కళాపూర్ణోదయమున కథాసంవిధాన వైచిత్ర్య ముండుటను, ఆయనకు దానియందు గురుభావ ముండుటను రామలింగారెడ్డిగారి విమర్శనము స్వయంసంపూర్ణమే. అయ్యును అది సమగ్రమేల కాదనగా కళాపూర్ణోదయమున నొక అఖండార్థము ప్రతీయమానమగు చున్నదా? అయినచో అదేమి? అది ఎట్లగుచున్నది? ఇత్యాది ప్రశ్నములకు సమాధానము లేదు గనుక ప్రభావతీప్రద్యుమ్నమును ఆయన పూర్తిగా విమర్శింపలేదు. ఆయన దానినట్లువిడచుటకు గల కారణము కళాపూర్ణోదయగ్రంథమున నున్నంత కథా సంవిధానవైచిత్రి అనగా అద్భుతమనిపించునట్లుండు హఠాత్సంభవములు, దానిలో లేకపోవుట కావచ్చును. నిజమునకు కావ్యకథను పరిశీలించుటలో అది ఎంత అద్భుతమును కల్గించుచున్నదన్నదాని కంటె తత్పరమార్థము ప్రధానము. ఆ లెక్కకు వచ్చినచో కథ నద్భుతముగా నల్లుటకు సూరన్న దాక పోనక్కరలేదు. సుబ్బన్న దీక్షితులును అల్ల గలడు. కావ్యకథా సంవిధానమున నున్న శిల్ప మంతయు సాంద్రతను గూర్చి అఖండార్థప్రతీతి కొదిగియుండునట్లు చేయుట గాని, అద్భుతమును సంపాదించుట గాదు. అది చేసినందున సూరన్న

గారు నిజమున కొక క్రొత్తది చేసినట్లే. క్రొత్త పని చేయుటయే గొప్ప గాదుగదా! కేవల కథా నిర్మాణ వైచిత్రియందే బుద్ధియుంచి ప్రభావతీ ప్రద్యుమ్నమునను వట్టి కథా నిర్మాణమును మాత్రమే ఆయన పరిశీలించెను. సూరన్న వ్రాసికొన్నాడు.

"ఒకట పూర్వోత్తర విరోధ మొందకుండ
తత్తదవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహాకావ్య తాత్పర్యమునకు నొనర
పలుక నేర్చుట బహు తపః ఫలముగాదె

ఈ పద్యము ప్రభావతీ ప్రద్యుమ్నములోనిది." కళాపూర్ణోదయమునను వట్టి కవిత్వమును గూర్చి ఒకటి రెండు పద్యములు వ్రాసెను. తపస్సు యొక్క ప్రసక్తి అచటలేదు. తపస్సనగా కవితా రూప తపస్సు. అసాధారణమైన యొక మహార్థమును సాధింపవలయునన్న నిష్ఠతో బుద్ధిచేయు నొక క్రియకు తపస్సని పేరు. కవియైన వాని తపస్సు దేనికొరకో సూరన్న పద్యములో నున్నది. అది వట్టి కథయొక్క పొసగింపుగాదు. కాదన్న విషయము రామలింగారెడ్డిగారు గ్రహింపలేదు. కనుకనే స్థూలమైన కథాసంవిధాన పరిశీలనముతో వారి విమర్శనము ముగిసినది. ప్రభావతీ ప్రద్యుమ్నమునందు శుచిముఖిని గూర్చి కొంత విపులముగా వ్రాసెను. నిజమునకది సాధనము. సాధ్యముగాదు. ఆ సాధన మట్లుపయోగించి సూరన్న సాధించిన పరమార్థమేమో మాత్రము రెడ్డిగారు వ్రాయలేదు. ప్రభావతీ ప్రద్యుమ్నములో నున్న గొప్పతన మంతయు వజ్రనాభవధ కార్యమును ప్రభావతీ ప్రద్యుమ్నముల ఇష్టసిద్ధి సాధన మనివార్యముగా సృష్టించి నిర్వహించుటలోనున్నది మరియు సూరన్నగారి నేర్పు ఇంద్రుడపేక్షించిన లోకహిత కార్యమగు వజ్రనాభ వధభారము ప్రద్యుమ్నుని యందు ప్రభావతీ గత ప్రేమ భావము రూపమున పెట్టుటలో నున్నది. మిగిలిన సర్వరచనయు తదుపస్కారకము, తదుద్దీపకము, శుచిముఖి ఈ సర్వములో చేరునది. దీనిని పెద్దచేయుట వలన అర్థ ప్రతీతి విషయమును ఆయన ఆలోచింపలేదు.

ప్రబంధములందు నాటక సరణి మృగ్యమని రెడ్డిగారి యాక్షేపము. నాటకసరణి యనగాపాత్రముల మాట మీద మాట వచ్చి కథ సాగినట్లుండుట. పాత్రోచిత భాష ఇత్యాదులని. ఈ విషయమును నా మొదటి వ్యాసమున వ్రాసితిని. ప్రబంధములలో కథ యెట్లుండునో ఇంతకుముందే మనవి చేసితిని. ఇంక అక్కడ నాటకసరణి యేమి? రెడ్డిగారు ప్రబంధములలో చూపిన మూడవ దోషము నిజముగా దోషమే. అది కేవల మొక్క ప్రబంధ ప్రక్రియకే సంబంధించినది గాదు. సర్వకవితా నిర్మాణమునకు సంబంధించినది. అప్రతిభు లధికముగా నాదోషమును చేయుదురు.

కావ్య విమర్శనమున మొట్ట మొదటిదియు, స్థూలమైనదియు నైన కథా శరీరముయొక్క ముందువెనుకల పొసగింపులోని వైచిత్రిని పరిశీలించుట, ప్రారంభించుట వలన రామలింగారెడ్డి గారు తెనుగులోని మొదటి విమర్శకుడు. మధ్య ఉన్న పదోఘట్టము నందుకొని గాక గ్రంథము నాద్యంతముగా పరిశీలించుటయు, ఆ గ్రంథమున తాను దర్శించిన మేలిమి నెంత అభినివేశముతో చెప్పునో, లోపములను కూడ అట్లే చెప్పుటయు మొదటిసారిగా చేయుటవలనను ఆయన మొదటి విమర్శకుడు—కావ్య విమర్శనమున కాయన రేఖా చిత్రము గీసి పోయెను. దేశీయమైన వ్యుత్పన్నతతో సంప్రదాయజ్ఞతతో సూక్ష్మ సూక్ష్మ విచారణశీలము కలిమిని దానిని మాంసలము చేసికొనవలయును. చేయుట జరుగుచున్నది గూడ —రామలింగారెడ్డిగారి కవిత్వ తత్వ విచారము వలన విమర్శనమున్నది అసలు విమర్శనపు గాడిలో పడినది అది ఆయనవల్ల దేశమునకు జరిగిన మహోపకారము. తిరిగి రెడ్డిగారి ప్రస్తావన రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారిని గూర్చి వ్రాయునపుడు తేవలసియున్నందున ఇంక నిక్కడాపుదును. ఈ వ్యాసమున రామలింగారెడ్డిగారి విమర్శనమునకు సంబంధించిన ముఖ్యమైన ఒక అంశమునే కొంత వ్రాసితిని. ఆయన మనకు మొదటి విమర్శకుడెట్లయ్యెనో అది.

# పితృతిథి | మల్లంపల్లి శరభయ్య

లిపి సమభ్యాస దినముల యపుడు నేను
దిద్దుకొనకమ్మ నెంతొ వేధించినాను
చెప్పవమ్మ ! సముద్రమ్ము చెఱువుకన్న
చిన్నదా ! పెద్దదా నాకు జెప్పుమనుచు.

చిన్ని నాకేలు మీ కనిష్ఠిక నమర్చి
నన్ను గొనిపోయి చూపిరి మిన్నులొరయు
నల మహా జలరాశి యనంతమనుచు
విరియు పసిగన్నులందు నచ్చెరువు నిండ.

కావ్య శిక్షా దినమ్ములు గడచి నిరత
భావనావశ హృదయ విపచ్యమాన
వాసనాదుగ్ధ పరవశ భావమందు
తఱిని మఱువకుమని చెప్పి తరలినారు.

గణిత సాధన పథమై ప్రగాఢ మోహ
వివశమై తండ్రి ! మీ పర్యవేక్షణమ్ము
తప్పి దెసమాలు మజ్జీవితమ్ము నందు
చెలగి యొకనాడు మిము దలంచినదిలేదు.

నే డమావాస్య. మున్నీటి నీట గలుప
వచ్చినాడను పితృ భుక్త భాజనముల
కబళిత నభః కటా హాంధకార విలయ
జలధి మీ కోపమరసి విహ్వలుడనైతి.

కంచి శేషగిరిరావు

# "మూడు టిక్కెట్లు"

[రంగము : నడుస్తున్న రైలు - అందులో ఒక పెట్టె]

టిక్కెట్ కలెక్టర్ : టికెట్ ప్లీజ్! టికెట్!

ఒకరు : ఇదిగో సార్ !

టి. క : టిక్కెట్ ! టిక్కెట్ !

ఒక ఆడమనిషి : మగవాళ్ళ దగ్గరుంది.

టి. క : మగవాళ్ళెక్కడ ?

ఆడమనిషి : పక్క పెట్టెలో వున్నారండి.

టి. క : ఏయ్ కాలక్షేపం బటానీలూ !

బటానీ మనిషి : అయ్యా !

టి. క : ఎక్కడికి జారుకుంటున్నావ్ ?

బ. మ : (హి ! హి !) ఎక్కడకూ లేదండి.

టి. క : పక్క పెట్టెలోకేనా ?

బ. మ : అబ్బే ! కాదండి.

టి. క : అయ్యా ! బావాజీలూ !

ఒక బావాజీ : చిత్తం !

టి. క : బైరాగి టిక్కెట్టేనా ?

బావాజీలు : అలక్ నిరంజన్ !

టి. క : ఏయ్ ! ముసలమ్మా ! టిక్కెట్ !

ముసలమ్మ : ఇదిగో అయ్యా !

టి. క : ఈ పిల్ల నీ పిల్లేనా ?

ముస : అవునయ్యా.

టి. క : టిక్కెట్టేదీ ?

ముస : కొంటంలేదయ్యా.

టి. క : కొంటంలేదూ ? పదేళ్ళుంటే.

ముస : ఏ మారాజూ తీసుకోటంలేదయ్యా.

టి. క : తీసుకోకపోతే మారాజన్నమాట !

ముస : ఇంకా చిన్నపిల్లే గదయ్యా !

టి. క : పిల్లేదు, కొనాల్సిందే.

ముస : బీదదాన్ని కటాచ్చించాలి.

టి. క : విద్యార్థి మహాశయా ! టిక్కెట్ !

విద్యార్థి : వుందండి.

టి. క : ఎక్కడ ?

వి : ఇంట్లో :

టి. క : కూడా తేలేదే ?

వి : మర్చిపోయా.

టి. క : నిజమేనా ?

వి : కావాలంటే అడగండి.

టి. క : ఎవరిని ?

వి : గుడివాడ స్టేషన్ మాష్టార్ని.

టి. క : సీజన్ టిక్కెట్టా ?

వి : అవును సార్ !

టి. క : గుడివాడ రాగానే మాయంగాకు.

వి : నాకేం భయం ?

టి. క : ఏమమ్మా ? టిక్కెట్ !

ఆవిడ : కొనలేదండి.

టి. క : ఏం ?

ఆవిడ : చిల్లర లేదన్నారండి.

టి. క : ఎక్కడ ఎక్కేరు ?

ఆవిడ : బందరులో.

టి. క : ఏవూరు వెళ్తారు ?

ఆవిడ : ఏలూరుకు.

టి. క : మనుష్యు లెంత మంది ?

ఆవిడ : నేనూ యీ యిద్దరు పిల్లలూ.

టి. క : మొత్తం రెండు టిక్కెట్లా ?

ఆవిడ : అవునండి.

టి. క : 4-40 అవుతుంది.

ఆవిడ : ఇదుగో డబ్బు.
టి. క : ఈ రెండు రూపాయల నోటు పడదు.
ఆవిడ : అయ్యో! పడదూ! ఏమొచ్చింది?
టి. క : మూనె మరకలు చాలా వున్నాయి.
పిన్నిగారు : చూసుకోలేదా అమ్మాయీ?
ఆవిడ : హడావిడిలో చూడలేదండి పిన్నిగారూ!
పిన్ని : పోపుల పెట్టెలో దాచావా?
ఆవిడ : అదంతా మీ కెందుకు?
పిన్ని : అవునులే! నా కెందుకులే!
టి. క : ఇంకోనోటివ్వండి.
ఆవిడ : ఇంకో నోటు లేదే?
టి. క : ఎట్లాగా? ప్రయాణం మానేయండి.
ఆవిడ : మానేయడమే! ఎప్పటికి మానను.
పిల్లవాడు : అమ్మా! ఇంటికి వెళ్ళిపోదామే.
ఆవిడ : చప్! నోర్మూయ్!
టి. క. : గుడివాడలో దిగిపోయి...
ఆవిడ : దిగను. ఎప్పటికి దిగను.
టి. క. : దిగి, బందరు బండి ఎక్కండి.
ఆవిడ : వీల్లేదు. ప్రయాణం సాగాల్సిందే.
ఒక ఆసామీ : ఉపాయం చూడండి, టిక్కెట్ కలెక్టరుగారూ!
టి. క. : ఏలూరులో ఎక్కడ దిగుతారు?
ఆవిడ : మా అమ్మ యింట్లో.
టి. క. : నాన్నగారు లేరా?
ఆవిడ : లేరు, పోయారు.
టి. క. : భర్తగారి పేరు, ఎడ్రస్..
ఆవిడ : భర్తగారి పేరా?
టి. క. : (విసుగుగా) అవును, చెప్పండి.
ఆవిడ : వారి పేరు మీ కనవసరం.
టి. క. : వారి పేరూ, ఎడ్రసూ చెప్పండి.
ఆవిడ : చెప్పనన్నా, అవసరంలేదు.
టి. క. : కొంచెం మర్యాదగా ప్రవర్తించండి.
ఆవిడ : కావాలంటే నా ఎడ్రస్ రాసుకోండి!
టి. క. : పనికిరాదు.
పిన్నిగారు : ఇంకా సిగ్గేనా అమ్మాయీ?
ఆవిడ : సిగ్గేమిటి? అన్నీ వదిలేస్తుంటే.
పిన్ని : మీ ఆయన వున్నారా?
ఆవిడ : వుండకేం? నిక్షేపంగా వున్నారు.
మరొక ఆడమనిషి : మొగాన బొట్టు కన్పడటంలా (మెల్లగా)
పిన్ని : బొట్టుకేంలే! అందరూ పెట్టుకుంటున్నారు.
మరొక ఆసామి : అయ్యా! టిక్కెట్ కలెక్టర్ గారూ!
టి. క : ఏమిటి?
మ. ఆ : ఒక్క మనవి.
టి. క : చెప్పండి, బాబూ చెప్పండి.
మ. ఆ : ఆ రెండు రూపాయిలూ నేనిస్తా.
ఆవిడ : అక్కర్లా! ఎవరూ యివ్వక్కర్లా!
పిల్ల : అమ్మా! ఇంటికి పోదామే!
ఆవిడ : నోరు మూసుకు కూర్చో.

[దెబ్బ కొడ్తుంది. పిల్ల ఏడుస్తుంది]

పిన్ని : అయ్యో! పిల్లను కొట్తావేం?
ఆవిడ : నా పిల్లను కొట్టుకుంటే మీకెందుకు?
పిన్ని : అవునులే! నాకెందుకులే!

... ... ...

[రైలులో ఇంకో పెట్టెలో - రెండో టిక్కెట్ కలెక్టర్]

రెం. టి. క : టిక్కెట్ ప్లీజ్! టిక్కెట్!
ఒకరు : ఇదుగో.
రెం. టి. క : ఇది గుడ్లవల్లేరు టిక్కెట్.
ఒకరు : నేను దిగేది గుడ్లవల్లేరే!
రెం. టి. క : ఇది ఎక్స్‌ప్రెస్.
ఒకరు : అయితే, నాకేం?
రెం. టి. క : ఇది గుడ్లవల్లేర్లో ఆగదు.
ఒకరు : ఆగకపోతే దిగేదెల్లా?
రెం. టి. క : గుడివాడలో ఆగుతుంది. దిగు.
ఒకరు : మల్లా ఎనక్కు రమ్మంటారా?
రెం. టి. క : అంతే మరి.
ఒకరు : మల్లా టిక్కెట్ కొనాలా?
రెం. టి. క : కొనక తప్పుతుందా,
ఒకరు : ఇదో దండుగా?

రెం. టి. క : తప్పు టిక్కెట్ కొంటే అంతే.
ఒకరు : ఆడెవడో దొంగ నచ్చినోడు.
రెం. టి. క : ఎవరు ? గుమాస్తా ?
ఒకరు : కాదు ఆడెవడో బయటుండి.
రెం. టి. క : ఊ ! అల్లాచెప్పు.
ఒకరు : బేడ తక్కువకు అమ్మేడు.
రెం. టి. క : ఏయ్ ! పడుకున్న ఆసామీ !
ఆసామీ : ఊ ! ఊ ! (దొర్లుతూ) ఊ !
రెం. టి. క : నిన్నే.
ఆసామీ : ఉహ ! ఊ ! ఏమిటి ?
రెం. టి. క : టిక్కెట్టేదీ ?
ఆసామీ : (ఆవులిస్తూ) ఎక్కడవుందండి ?
రెం. టి. క : బయటకు తియ్యి.
ఆసామీ : ఎక్కడ పెట్టేనో మర్చిపోయానే.
రెం. టి. క : వెతుకు. త్వరగా వెతుకు.
ఆసామీ : (బద్ధకంగా) వెతుకతా. వెతుకుతా,
రెం. టి. క : నిగడదన్ని పడుకున్నావు, లే !
ఆసామీ : పానం బాగా లేదండి.
రెం. టి. క : ఊ ! లే ! నుంచున్న వాళ్ళు కూర్చుంటారు.
ఆసామీ : (ఆవలిస్తూ) ఆ ! లేస్తున్నా.
రెం. టి. క : ఇదుగో ! మిస్టర్ ! టిక్కెట్.
అతడు : ... ... ...
రెం. టి. క : (గట్టిగా) ఓయ్ ! మిస్టర్ ! టిక్కెట్.
అతడు : (ఉలిక్కిపడి) నన్నేనా ?
రెం. టి. క : అవునుసార్ ! మిమ్మల్నే.
అతడు : నన్నా ? నాతో మీకేం పని ?
రెం. టి. క : పరధ్యానంలో వున్నట్టున్నారు.
అతడు : ఆ ! ఏదో ఆలోచిస్తున్నా.
రెం. టి. క : టిక్కెట్ చూపించండి.
అతడు : కొనలేదు. కొనాలి.
రెం. టి. క : ఎందుకు కొనలేదు ?
అతడు : రైలు కదల్తుంటే ఎక్కా.
రెం. టి. క. గార్డుతో చెప్పారా ?
అతడు : ఆ ! చిలకలపూడిలో చెప్పా.
రెం. టి. క : అయితే బందరులో ఎక్కేరా ?
అతడు : అవును.
రెం. టి. క : టిక్కెట్ ఎక్కడికి కావాలి ?
అతడు : మూడు వూళ్ళకు !
రెం. టి. క : మూడు వూళ్ళా ? ముగ్గురెవరు ?
అతడు : అప్ప, అమ్మ, అన్న.
రెం. టి. క : (ఆశ్చర్యంగా) వాళ్ళెక్కడున్నారు ?
అతడు : (మ్చ్) క్షమించాలి. తప్పు చెప్పా.
రెం. టి. క : అయితే, కావాల్సింది ఎన్నిటిక్కెట్లు?
అతడు : మూడే. మూడని చెప్పేగా.
రెం. టి. క : ముగ్గురు లేరుగా మరి ?
అతడు : మూడూ నాకే కావాలి.
రెం. టి. క : (ఆశ్చర్యంగా) అదేమిటి ?
అతడు : మీ కర్థంకాదులెండి.
ఒక మనిషి : అయ్యా ! టిక్కెట్ కలెక్టర్ గారూ !
రెం. టి. క : ఏమిటి స్వామీ !
ఒక మనిషి : ఒక చిన్న మనవి.
రెం. టి. క : చెప్పండి.
ఒక మనిషి : మీరు వారిని విసిగించవద్దు.
రెం. టి. క : నేను ఆయన్ను విసిగిస్తున్నానా ?
రెండో మనిషి : లేకపోతే ఏమిటండీ !
ఒక మనిషి : ఆయనెందుకో విచారంగావుంటే...
అతడు : నాకా... విచారమా ? (హ, హ, హ) లేదు.
రెం. టి. క : సరే ! మూడు టిక్కెట్లు ఎక్కడికి ?
అతడు : మూడూ మూడు వూళ్ళకు.
రెం. టి. క : బాగుంది ! వ్యవహారం.
అతడు : ఒక టిక్కెట్ తెనాలికి.
రెం. టి. క : ఊ ! తెనాలికి. తెనాలిలో ..
అతడు : అప్పవుంది.
రెం. టి. క : ఊ ! రెండో టిక్కెటో ?
అతడు : ఏలూరుకు.
రెం. టి. క : ఏలూరులో, అమ్మ. అంతేనా ?
అతడు : అవును మూడో టిక్కెట్టు....
రెం. టి. క : గుంటూరుకా ?

అతడు : ఉహూ కాదు! వరంగల్లుకు.
రెం. టి. క : అక్కడ అన్న. అంతేనా ?
అతడు : రైట్! బాగా గ్రహించారు.
రెం. టి. క : మూడు టిక్కెట్లతో మూడురైళ్ళు ఎక్కుతారా ?
అతడు : కాదు. కాదు.
రెం. టి. క : మరి!
అతడు : బెజవాడలో దిగి....ఊ! మరి!...
రెం. టి. క : ఊ! దిగి ?
అతడు : మూడురైళ్ళూ వెదకుతా.
రెం. టి. క : ఓహో! అదా సంగతి! వెదకితే ?
అతడు : ఒక రైల్లో దొరకుతారు.
రెం. టి క : ఎవరు ?
అతడు : ఎవరో మీ కనవసరం.
రెం. టి. క : వారు దొరికితే ?
అతడు : ఆరైలు నేను ఎక్కుతా ?
రెం టి. క : దొరక్కపోతే ?
అతడు : ఏదో ఒకరైలు ఎక్కుతా ?
రెం. టి. క : బాగుంది! మంచిప్లాను వేశారు
అతడు : మరి మూడు టిక్కెట్లూ యివ్వండి.
రెం. టి. క : ఆ మూడూ బెజవాడలో కొనుక్కోరాదూ ?
అతడు : వద్దు! వద్దు!
రెం. టి. క : ఏం ?
అతడు : కొనడానికీ, వెదకడానికీ టైముండదు.
రెం. టి. క : అందుకనా, యిప్పుడే కావాలంటున్నారు.
అతడు : అవును, యివ్వండి.
రెం. టి. క : ఆలోచించాలి.
అతడు : ఆలోచించాలా ? దేనికి ?
రెం. టి. క : రూల్సు ఒప్పుకోవు.
అతడు : ఏమిటా రూల్సు ?
రెం. టి. క : మనిషికి ఒక టిక్కట్టే యివ్వాలి.
అతడు : నాకవి చాలా అవసరం.
రెం. టి. క : గుడివాడ రానీయండి.

అతడు : వస్తే ?
రెం. టి. క : మూడూ గుడివాడలో కొనచ్చులెండి.

... ... ...

[గుడివాడ ప్లాట్‌ఫారం కాఫీహోటల్‌దగ్గర దృశ్యం]

రెం. టి. క : రెండిడ్లీ, రెండు కాఫీ.
మొ. టి. క : నాకు యిడ్లీ వద్దురా ?
రెం. టి. క : పోనీ, కాఫీ కావాలా ?
మొ. టి. క : సరేలే! రానియ్యి.
రెం. టి. క : ఒక యిడ్లీ, రెండు కాఫీ.

[ఇడ్లీ తింటు, కాఫీ త్రాగుతూ]

మొ. టి. క : డ్యూటీ తమాషాగా వుందిరా.
రెం. టి క; కొత్తలో అంతేరా!
మొ. టి. క : ఒక పేచీ వచ్చిందిరా.
రెం. టి. క : ఆడ పేచా ? మగ పేచా ?
మొ. టి. క : ఆడపేచీలే.
రెం టి క : ఏమిటి సంగతి ?
మొ. టి. క : నూనె మరక నోటిచ్చింది; పుచ్చుకోలా ?
రెం టి. క : పోనీ తీసుకోకపోయావా ?
మొ. టి. క : తీరా పడకపోతే నాచేతి దండుగ.
రెం. టి. క : ఎడ్రెస్ తీసుకోకపోయావా ?
మొ. టి. క : అక్కడే వచ్చింది పేచీ.
రెం. టి. క : ఏం జరిగింది ?
మొ. టి. క : మొగుడి ఎడ్రస్ యివ్వదుట!
రెం. టి. క : తన ఎడ్రస్ రాసుకోమందా ?
మొ. టి. క : ఆ! అంతే.
రెం. టి. క : ఉద్యోగం చేస్తోందా ?
మొ టి. క : అల్లా కన్పడలేదు.
రెం. టి. క : మొగుడు లేడా ?
మొ. టి. క ; పుంస్త్రీయే! బొట్టుంది.
రెం టి. క : మరేంచేశావు ?
మొ. టి. క : సందేహం వచ్చి వూరుకున్నా.
రెం. టి. క : సందేహం దేనికిరా ?
మొ. టి. క : నిరాధారమని తర్వాత తెలిస్తే ?
రెం. టి. క : ఇంకేం ? దూరమాలోచించావు.

మొ. టి. క : ఆ నష్టం నేనే భరించాలికద ?
రెం. టి. క : ఎందుకులే గొడవ— దింపెయ్ !
మొ. టి. క : అన్నా ; ససేమిరా, దిగనంటుంది.
రెం. టి. క : నా సంగతి చెబుతా విను.
మొ. టి. క : వింటాలే : నన్నేం చేయమంటావు.
రెం. టి. క : చెబుతాలే. చెప్పేది వినవోయ్!
మొ. టి. క : నీది ఆడపేచా, మగపేచా ?
రెం. టి. క : ఊహ! మగవాడే! మతిచలించిందేమో ?
మొ. టి. క : ఏమంటాడు ?
రెం. టి. క : మూడు టిక్కెట్లు కావాలంటాడు.
మొ. టి. క : ఇందులో పేచీ ఏమిటోయ్ ?
రెం. టి. క : మూడు స్టేషన్లకు మూడు టిక్కెట్లు కావాలిట !
మొ. టి. క : మరి యివ్వలేదా ?
రెం. టి. క : మూడు శాల్తీలు లేందే.
మొ. టి. క : మూడూ తనకే కావాలా ?
రెం. టి. క : ఊ ! అదే సంగతి !
మొ. టి. క : మూడూ ఏ వూళ్ళకు ?
రెం. టి. క : తెనాలి, ఏలూరు, వరంగల్లు.
మొ. టి. క : మూడింటితో ఏంచేస్తాడు ?
రెం. టి. క : కొన్నాక చింపేస్తాడేమో !
మొ. టి. క : మూడు రైళ్ళలో ఒక్కసారే ఎక్కుతాడా ?
రెం. టి. క : కాదుట. మూడు రైళ్ళూ వెదకుతాడుట.
మొ. టి. క : వెదికేది ఎవరిని ?
రెం. టి. క : ఆ సంగతి చెప్పటంలేదు.
మొ. టి. క : టిక్కెట్టిచ్చావా ?
రెం. టి. క : ఎట్లా యిస్తాను ?
మొ. టి. క : ఇటువంటప్పుడు ఏంచేయాలి ?
రెం. టి. క : అదే ఆలోచిస్తున్నా.
మొ. టి. క : నా పెట్టెలో మనిషి ఏలూరు వెళ్తుందిట.
రెం. టి. క : ఆ సంగతి ఇందాకే చెప్పలేదే ?
మొ. టి. క : మరచిపోయా.
రెం. టి. క : నాకో ఆలోచన తట్టోందిరా.
మొ. టి. క : నాకూ యిప్పుడే తట్టిందిరా.
రెం. టి. క : నా ఊహ ఏమిటంటే.
మొ. టి. క : నాకు తట్టిందేమిటంటే...
రెం. టి. క : ఆగు, నన్ను చెప్పనియ్యి.
మొ. టి. క : నేను కూడ చెప్తాలే.
రెం. టి. క : నా పెట్టెలో వున్న...
మొ. టి. క : ఆ మగమనిషిని తెచ్చి...
రెం. టి. క : నీ పెట్టెలో ఎక్కిస్తే...
మొ. టి. క : నీ పెట్టెలోని...ఆడమనిషిని...తెచ్చి
రెం. టి. క : ఊ ! కానియ్యి.
మొ. టి. క: నీ పెట్టెలో...ఎక్కిద్దాం...అంతేనా?
రెం. టి. క : ఏడిసినట్టే వుంది నీ తెలివి.
మొ. టి. క : అయితే అడదాన్ని కదపద్దంటావా?
రెం. టి. క : ఆడవాళ్ళజోలికి వెళ్ళద్దురా ?
మొ. ట. క : మగవాడిని నా పెట్టెలో ఎక్కిస్తే ?
రెం. టి. క : మన యిద్దరి పేచీలు.....ఊ......అందుకో...
మొ. టి. క : వాటంతటవి.....విడిపోతాయి......అంతేనా ?
రెం. టి. క : కాదురా ! విడిపోతాయేమో.....చూద్దాం.
మొ. టి. క : అతడు నా పెట్టెలోకి వస్తాడా ?
రెం. టి. క : ఓ ! నేను తీసుకువస్తాగా !

.... .... .... ....

[దృశ్యము - మొదటి పెట్టె]

రెం. టి. క : పంతులుగారూ ! కూర్చోండి.
అతడు : కూర్చుంటా ? మరి టిక్కెట్లు ?
రెం. టి. క : నేనిస్తాగా.
అతడు : నువ్వా ! కాంతం ! నువ్వా !
ఆవిడ : ఆ ! అవును ! నేనే !
అతడు : నువ్వూ యీ రైలే ఎక్కావా ?
ఆవిడ : మీ సహధర్మచారిణిని కదా !
అతడు : సహధర్మచారిణివి చెప్పకుండా రైలెక్కావే?

ఆవిడ : ఉత్తరం రాసిపెట్టేగా.
పిల్ల : అమ్మ కొట్టింది నాన్నా !
అతడు : నేనున్నాలే తల్లీ!
మొ. టి. క : ఏయ్ ! బావాజీలూ !
బావాజీలు : అయ్యా !
మొ. టి. క : ఇంకా దిగిపోలేదా ?
బావాజీలు : చిత్తం! చిత్తం !
మొ. టి. క : ఆ మూలసీటు ఖాళీచేయండి.
బావాజీలు : చిత్తం . చిత్తం !
రెం. టి. క : పంతులుగారూ ! మీరూ, ఆవిడా...
మొ. టి. క : ఆ మూలసీటులో కూర్చుని....
రెం. టి. క : స్థిమితంగా మాట్లాడుకోండి !
ఆవిడ : మీరు అప్పుడే వస్తారనుకోలేదే !
అతడు : రానూ ! రాకపోతే ఎల్లా ?
పిల్ల : నాన్నా !... మరే !.... అమ్మే !
అతడు : ఆ సీటులో కూర్చుందాం రా.
ఆవిడ : ఆ మూలకు వద్దు లెండి.
అతడు : నీతో మాట్లాడాలి... పద.
ఆవిడ : ఏమిటా మాటలు ?
అతడు : ముందు ఇక్కడనుంచి కదలు.
[ఇద్దరూ, పిల్లలతో మూల సీటులో కూర్చుంటారు
రైలు కదలుతుంది]
అతడు : అబ్బాయిని నాకియ్యి ?
ఆవిడ : వద్దు లెండి. నా దగ్గరే వుంటాడు.
అతడు : సరే ! నీ యిష్టం !
ఆవిడ : రాసిపెట్టిన ఉత్తరం చదువుకున్నారా ?
అతడు : ఆఁ ! అందుకనే ఇక్కడకు తయారయా.
ఆవిడ : ఏ రాత్రికో యింటికి వస్తారనుకున్నానే.
అతడు : మధ్యాహ్నం స్కూలుకు సెలవిచ్చారులే.
ఆవిడ : ఏమైతేనేం ? ఎవరిగతి వారిదే.
అతడు : అసలు సంగతి విను.
ఆవిడ : వింటే అధోగతే!
అతడు : పుట్టింట్లో నీ గతి బాగుంటుందా ?
ఆవిడ : మనింట్లో గతికంటె నయమే.
అతడు : ఇక వుండవులే అవస్థలు.
ఆవిడ : ఆఁ ! కొన్ని వందలసార్లు ఇలాగే చెప్పేరు.
అతడు : మనింటికి పోదాం పద.
ఆవిడ : రాను.
పిల్ల : అమ్మా ! యింటికి వెళ్దామే.
ఆవిడ : చప్ ! నోర్ముయ్.
అతడు : దాన్ని కసరుకుంటా వెందుకు ?
ఆవిడ : మధ్య మీకెందుకు ?
అతడు : నాక్కాకపోతే యింకెవరికి ?
ఆవిడ : మహా యిప్పుడు కావాల్సొచ్చింది.
అతడు : సరేలే! ఒక సంగతి విను.
ఆవిడ : వినను.
అతడు : పోనీలే ! ప్రశ్నలడుగుతా.
ఆవిడ : ప్రశ్నలా ? ఏమిటవి ?
అతడు : ఎక్కువసేపు విసిగించనులే.
ఆవిడ : సరే అడగండి.
అతడు : పుట్టింటికి ఎందుకు వెళ్తున్నావ్ ?
ఆవిడ : నేను నా పిల్లల్ని పోషించుకోడానికి.
అతడు : నా సంపాదన చాలదా ?
ఆవిడ : చాలితే తిప్పలెందుకు ?
అతడు : నీవు ఉద్యోగం చేయాలా ?
ఆవిడ : చేస్తే తప్పా ?
అతడు : ఏ ఉద్యోగం చేస్తావు ?
ఆవిడ : బ్రతకడానికి ఏదో ఒకటి.
అతడు : నీచేతనయింది పాటలు, కుట్లులేగా !
ఆవిడ : పాటలు, కుట్లులు నేర్పితే పొట్టనిండకపోదు.
అతడు : నాలాగా పంతులుద్యోగ మన్నమాట.
ఆవిడ : ఆ ! మీ అర్ధాంగిని కాదూ ?
అతడు : ఇందులో అర్ధాంగి వన్నమాట.
ఆవిడ : అర్థం సంపాదించుకుంటే చాలు.
అతడు : నెల కెంత సంపాదిస్తావు ?
ఆవిడ : ఏ నలభై రూపాయలో రాకపోవు.
అతడు : సరిపోతాయా ?
ఆవిడ : మూడు పొట్టలకు చాలకపోవు.
అతడు : రోజు కెన్ని గంటలు కష్టపడతావు ?
ఆవిడ : మీలాగే ! ఏడెనిమిది గంటలు.

అతడు : అంత కష్టపడట మెందుకు ?
ఆవిడ : లేకపోతే అడుక్కు తినుమంటారా ?
అతడు : కాదులే! హాయిగా బ్రతకమంటున్నా !
ఆవిడ : ఎల్లా ?
అతడు : (నవ్వుతూ) నెలలో గంట కష్టపడి.
ఆవిడ : గంటకు నలభై రూపాయలు వస్తాయా ?
అతడు : ఆఁ! అంతకంటె ఎక్కువే వస్తాయి.
ఆవిడ : నాతో ఇంకా వేళాకోళమా ?
అతడు : వేళాకోళానికి వేళ కాదు సఖీ !
ఆవిడ : మతి దగ్గరే వుందా ?
అతడు : నీ మీదే వుంది కదా !
ఆవిడ : అబ్బ! ఏమిటా మాటలు !
అతడు : పొలయలుక పలుకులివి ప్రియా !
ఆవిడ : (నవ్వుతూ) అదిగో! పిన్నిగారు వింటున్నారు.
అతడు : ఎవరా పిన్నిగారు ?
ఆవిడ : లోకంలో వుండే పిన్నిగారు.
అతడు : అసలు సంగతి చెబుతా! వింటావా ?
ఆవిడ : ఊఁ! చెప్పండి ! త్వరగా !
అతడు : (హా! హా! హా!) కాంతంగారు దిగిందయ్యా మెట్టు !
ఆవిడ : చెప్పండి!
అతడు : ముందు అబ్బాయిని వాకియ్యి.
ఆవిడ : ఇదుగో! తీసుకోండి.
అతడు : ఇవాళొక ఉత్తర మొచ్చింది.
ఆవిడ : మా అన్నయ్య రాశాడా ?
అతడు : మీ అన్నయ్య రాసేరకం కాదులే.
ఆవిడ : మరెక్కడి నుంచి ? చెప్పండి!
అతడు : ఆలిండియా రేడియో నుంచి వచ్చింది.
ఆవిడ : ఇన్నాళ్ళకా ? ఛాన్సు లేదనేగా ?
అతడు : (ఉహు!) నీ రొట్టె నేతిలో పడిందిలే.
ఆవిడ : అంటే ?
అతడు : నీ పాటలు లోకం వింటుందిట.
ఆవిడ : నిజం !
అతడు : ఇదుగో! ఉత్తరం చదువుకో.
ఆవిడ : నా కెందుకు ? ఇంగ్లీషు రాదుగా.
అతడు ; వారానికో పావుగంట పాడమన్నారు.
ఆవిడ : ఏమిస్తారు ?
అతడు : పావుగంటపాటకు పదిహేనురూపాయలు.
ఆవిడ : అంటే నెలకు అరవై రూపాయలు.
అతడు : అంటే నా నెలజీతంతో సమానం.
ఆవిడ : అంతా మీ శ్రమ ఫలితమేగా !
అతడు : నాకంటె గొప్పదానివవుతున్నావులే !
ఆవిడ : ఛా ! అల్లా అనకండి.
అతడు : గంట కరవై రూపాయలు గొప్పకాదూ?
ఆవిడ : ఇంక మన కష్టాలు గట్టెక్కినట్లే.
అతడు : ముంచుకుపోయిందని పుట్టింటికి బయలుదేరావుగా.
ఆవిడ : ఏదో పొరపాటు లెద్దురూ.
అతడు : నీ పాటలతో మన పాట్లు తప్పుతాయిలే.
ఆవిడ : అయితే ఇంటికి వెళ్ళిపోదామా ?
అతడు : ఇంటిక్కాదు. బెజవాడకు వెళ్దాం.
ఆవిడ : అప్పుడే !
అతడు : రేపే నీవు పాడాలిట.
ఆవిడ : అయితే సరేలెండి.
అతడు : హల్లో! టిక్కెట్ కలెక్టరుగారూ !
ఇద్దరు, టిక్కెట్ కలెక్టర్లు : (సంభ్రమంగా) 'వాట్' సర్ ! వాట్ ?'
అతడు : బెజవాడకు ఒక టిక్కెట్టు రాయండి.
రెం. టి. క : మూడు టిక్కెట్లు వద్దా సార్ ?
అతడు : వద్దు. నేనొక్కడినే.
ఆవిడ : అదేమిటి? మాటిక్కెట్ల మాటో ?
అతడు : మీకు టిక్కెట్లా ? కొనలేదా ?
ఆవిడ : లేదు. నోటు పడదన్నారు.
అతడు : అయితే మూడుటిక్కెట్లు రాయండి.
రెం. టి. క : అట్లాగే సార్ !
మొ. టి. క : ఆగవోయ్! నన్ను రాయనియ్యి.
రెం. టి. క : ఆయన నా మనిషోయ్!
మొ. టి. క : ఆవిడ నా కంపార్టమెంటు మనిషోయ్!

రెం. టి. క : ఎవరి టిక్కట్లు వాళ్లు రాద్దాములే.

ఇద్దరు టి. క : మూడు టిక్కెట్లూ, బెజవాడకేనా?

అతడు, ఆవిడ : ఆ ! మూడూ బెజవాడకే.

పిన్నిగారు : అమ్మాయీ ! ఆయన మీవారా !

ఆవిడ : అవునండి పిన్నిగారూ !

పిన్ని : చిలకా గోరింకల్లాగ వున్నారు.

ఆవిడ : క్షమించండి ! ఇందాక కోపగించుకున్నా.

పిన్ని : కోపాలెంతలో పోతాయిలే !

అతడు : టిక్కెట్ కలెక్టర్‌గారూ ! మీ మేలు మర్చిపోను.

రెం. టి. క : నా డ్యూటీ నేనుచేశాను సార్ !

---

## స్వీకృతి

| | | | |
|---|---|---|---|
| ప్రణుతి | కవిరాజమూర్తి | ఖమ్మం | 31 పేజీలు<br>ఒక రూపాయి |
| దయామయి | 'మధురస్వరాల సరాలు' | కవితాసంస్థానం<br>వితంరాజుపల్లె | నాల్గు అణాలు |
| మధుమాసము | 'మధురస్వరాల సరాలు' | కవితాసంస్థానం<br>వితంరాజుపల్లె | అర్ధరూపాయి |
| గాయకబ్రహ్మ | 'మధురస్వరాల సరాలు' | కవితాసంస్థానం<br>వితంరాజుపల్లె | మూడణాలు |
| చుక్కాని (వార పత్రిక) | సంపాదకులు :<br>రావూరి సత్యనారాయణరావు | | సం.చందా. 9-0-0<br>విడి సంచిక 0-2-0<br>80 పేజీలు |
| శోభ | సంపాదకులు :<br>పేర్వారం జగన్నాథం<br>ఆర్ట్సు అండ్ కామర్సు కళాశాల<br>ఉస్మానియా విశ్వవిద్యాలయం. | | |

# సంపూర్ణానంద్   జాతకభాగము - దాని శాస్త్రీయత

౧

జ్యోతిషము నాకు మిక్కిలి అభిమాన విషయము. దీనిని గురించి నన్ను మాట్లాడుమన్నందుకు మిక్కిలి కృతజ్ఞుడను. ఇట్లు చేయుటవలన సత్యాన్వేషకులకు సహజమైన సహన సౌజన్యములను మీరు ప్రదర్శించుకొన్నారు. సత్యాన్వేషణ పరుడుకదా శాస్త్రవాది. మీరు నా యుపన్యాసమును విన్నంత మాత్రమున వచ్చెడి ప్రమాదములేదు. ప్రతిదానిని సందేహింప వలయుననుట మంచి పద్ధతి గావచ్చును. ఈ పద్ధతి బట్టి చూచినను దానిని సందేహించుటకు పూర్వము నీవు దానిని గురించి ఎదుటివారు చెప్పుదానిని సమగ్రముగా విన వలయునని తేలుచున్నది. ఆ విషయమును విశ్వసించువారు ఏమి చెప్పెదరో వినకుండ దానిని త్రోసివేయుట సంకుచిత మనస్తత్వము. ఇది హృదయమును విస్తరింపనియ్యదు. యదార్థమును గ్రహింపనీయదు. రాగ ద్వేషములను మీర నీయదు. ఈ జాతకవిద్య ప్రాచీనకాలమునుండి మహారాజుల మన్ననల నందుకొనుచున్నది. ఇట్టి యీ విద్యను మూఢ విశ్వాసమని త్రోసివేయుట కేవలము అల్ప ప్రకృతిని దాటుకొనుట.

జాతకవిద్య సశాస్త్రీయమాయని దుయ్యబట్టు వారిని చూచినప్పుడు నాకు కొంత వినోదముగా నుండునుగాని ఎక్కువగా వారియందు జాలివేయును. మానవుల యదృష్టమునకు నక్షత్రములకు సంబంధ మేమియో వారికి తెలిసికొన వలయునని యభిలాష. జాతకము యొక్క మూల సూత్రములను తెలిసికొనవలెనను కోరిక, మొదటిదానియొక్క అనుభవము సూత్రప్రాయముగా తెలిసికొన గోరుట న్యాయమే, సహజమే. కాని దానికిముందు తెలిసికొన వలసిన విషయములు చాల యున్నవి. ఆ అంశములు యధార్థములు. ఇట్టి యథార్థాంశముపైన ఆధారపడి వాని అనుభవమున్నది. అందుచేత ముందుగా వానిని గుర్తింపవలయును. పండ్లు, రాలు, మనుష్యులు మొదలైన సర్వ వస్తువులు పతన స్వభావము గలవి. ఇది యందరకు తెలిసిన యథార్థము. దీనిమీద ఆధారపడిగదా భూమ్యాకర్షణ యొక్క అనుభవమున్నది. ఇది భూమ్యాకర్షణ సిద్ధాంతమునకు త్రోవ తీసినది. ఆ యదార్థమును గుర్తించని వానికి ఈ యనుభవములేదు. ఈ సిద్ధాంతములేదు. కావున కొన్ని యదార్థముల మీద యొక అనుభము దానిపైన నొక సిద్ధాంతము ఆధారపడి యుండును. అట్టి సంఘటనమే జరుగపునడు దానిని గురించిన సామీచీన్య విచారణము మనము చేయముగదా. ఇట్లే జాతక విషయమున ఆయా గ్రహసంచార మట్లున్నప్పుడు ఆయా సంఘటనలు భూమిమీద జరుగుచున్నవి. అని గుర్తించి నప్పుడే వాని పరస్పర సంబంధమును వ్యాఖ్యానింప వలసిన యవసరమున్నది. లేనిచో అట్టి విచారణమువల్ల యెండమావులను వెంటాడుట, మరి అట్టి సంఘటనలు జరుగక పోయినను జరిగినట్లూహించుకొన వచ్చును గదా యన్నచో నిసలైన శాస్త్రవాది అట్టి వానిని వ్యాకరించుటకు తన తల పాడుచేసికొనడు. అందుచేత జ్యోతిష్కుడు యథార్థములని చెప్పినవానిని విశ్వసింపనివాడు వాని శాస్త్రీయతను వ్యాకరింపుమని యడుగుట న్యాయముగాదని మనవిచేయుచున్నాను. మీరందరు జ్యోతిష్కులు చెప్పిన ఫలితములు నిజమగుట చూచియుందురు. భవిష్యత్తునందు వారు చెప్పినట్లు జరుగుట కేవలము కాకతాళీయమందుమా? ప్రతి దానిని కాకతాళీయమని త్రోసివేయుట, ప్రతి దానిని గ్రుడ్డిగా నమ్ముట, రెండు నొకే జాతిలోనివి. పైని చెప్పిన యనుభవము లేనివారికి నామాట లర్థముగావు. అట్టివారికి నేనొకటి చెప్పెదను. నాయనా! నీవొక జ్యోతిష్కుని యొద్దకుపోయి జాతకము చూపించుకొమ్ము. కొంత కాలము పోయిన తర్వాత ఆయన చెప్పినట్లు జరుగునో లేదో పరిచూచుకొనుము అని. అతడు శాస్త్రవాది యైనచో అతడు నేను చెప్పినట్లు చేసి చూడ వలెను. తర్వాత అతని అనుభవమునుబట్టి జాతకవిద్య నొప్పుకొనుటయో, కొట్టివేయుటయో చేయవచ్చును.

జాతకవిద్య జ్యోతిశ్శాస్త్రమందొకభాగము. కాని దీనికి నక్షత్రములతో నంత పనిలేదు. అసలు సంబంధము లేదని గాదు. కాని యా నక్షత్రముల ప్రాధాన్యమంతగా లేదని. జ్యోతిష్కుడు గ్రహసంచారమును పరిశీలించును. భూమి యొక గ్రహము. దాని చలనము యితరగ్రహముల చలనముతో సంబంధించినట్లు పరిశీలింపవలయును. కాని యొకటి

యున్నది. భూమిమీద నిల్చిచూచిన సూర్యుడు చలించునట్లు గనిపించుచున్నది. భూమి నిశ్చలముగ గన్పించును. న్యాయమునకు భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నది. సూర్యుడు తనచుట్టు తాను తిరుగుచున్నాడు. ఈసంగతి బహు ప్రాచీన కాలమునుండి జ్యోతిర్వేత్తలకు తెలియును. భూమి సూర్యుని చుట్టు తిరుగుచున్నదనగా నిజమునకు సూర్యునిచుట్టు తిరుగుట గాదు. భూమియు సూర్యుడు రెండు బంతులవంటివి. సూర్యుడు పెద్దబంతి. భూమి చిన్నబంతి. రెండింటికి యిరుసు ఒక్కటే. ఈ యిరుసు పరిమాణమున ఎన్నోరెట్లు పెద్దగ్రహము కాబట్టి సూర్యునియందున్నది. ఈ యిరుసుచుట్టు అవి రెండు తిరుగుచున్నవి. ఇందుచేత సూర్యుడు తనచుట్టు తాను తిరుగుచున్నట్లు భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నట్లు భాసించుచున్నది. భూమిమీదనున్న మనకు సూర్యుడు తిరుగుచున్నట్లు, భూమి నిశ్చలముగ నున్నట్లు భాసించుచున్నదిగదా. అందుచేత మనము సూర్యుని గమనమునుబట్టి భూగమనమును లెక్కగట్టుకొనవలెను. సూర్యుడిరువదినాలుగు గంటల కొకపర్యాయము ఉదయించుటవలన భూమి యింతకాలములో తనచుట్టు తాను తిరుగుచున్నదని మనము గ్రహించుచున్నాము. ఇట్లు సూర్యునికి సంబంధించి భూమి చలనము లెక్కకట్టబడినది. ఈ కారణముచేత సూర్యుడు గ్రహములలో చేర్పబడినాడు. నక్షత్రములు మనుష్యుని అదృష్టమును నడపుచున్నవనగా, అచట నక్షత్రములన్నమాటకు గ్రహములని యర్థము. ఒక గ్రహము సూర్యునిచుట్టు తిరుగుచున్నపుడు ఒక్కొక్క ప్రదేశమున నేనక్షత్రముల గుంపునకు సూటిగా నుండునో ఆ నక్షత్రరాశిలో ఆ గ్రహమున్నదని చెప్పుదుము. సింహరాశి యందు సూర్యుడున్నాడనగా సింహరాశికి సూటిగానున్న ఆకాశభాగమునందు సూర్యుడున్నాడని యర్థము. ఈవిధముగ నక్షత్రములకు జాతకమునందు ప్రవేశము గలిగినది.

చంద్రుడు భూమికుపగ్రహమే యైనను, గ్రహములలోనే చేర్పబడినాడు. అంతేగాక చర్మ చక్షువునకు గనిపించని ఇంద్ర, యమ, వరుణులను గ్రహములుగూడ నున్నవి. బుధ సూర్యులకు నడుమ మరొక గ్రహమున్నదని కొందఱు చెప్పుదురు. దీనికి 'వాల్కన్' యను పేరుగూడ బెట్టిరి. గురుశనులకు మధ్య పొడవైన క్షుద్రగ్రహముల వరుస మరియొకటున్నది. ఈ వరుసనంత నొక గ్రహముగా తీసికొన్నచో దానికిగూడ మనుష్యుల భవిష్యత్తుమీద యధికారముండియుండవలయును. భారతీయ జ్యోతిశ్శాస్త్ర మీ క్రొత్త గ్రహముల గణింపలేదు. కాని పాశ్చాత్య జ్యోతిష్కులు వాటి వ్యవహారమును పరిశీలించుచున్నారు. ఈ పరిశీలనా ఫలితము నప్పుడే ఇదమిత్థము నిర్ణయించుటకు వీలులేదు. ఈ క్రొత్తగ్రహములు సూర్యునిచుట్టు నొకసారి తిరిగి వచ్చుటకు చాల పెద్దకాలము పట్టును. క్షుద్రగ్రహ సంవత్సరము శని సంవత్సరముకంటె చిన్నదేగాని ఆ క్షుద్రగ్రహములయొక్క ఫలితములను లెక్కగట్టుట మిక్కిలి కష్టము. ఒకవేళ వానికి ఫలితమేమైనయున్నచో అది యుపేక్షితవ్యమే గాని ఉపాదేయముగాదు. కాని భారతదేశములోగూడ జన్మపత్రికలయందీ క్రొత్తగ్రహముల స్థితిని నిర్దేశించి ఫలితములను లెక్కగట్టుకొన్నచో బాగుండును.

మన జాతక చక్రములయందు రాహు కేతువులయొక్క స్థితులనుగూడ సూచించుచున్నారు. ఇవి నిజమునకు గ్రహములుకావు. ఛాయలు. భూ సంచార మార్గము యొక్కయు చంద్రసంచార మార్గము యొక్కయు పరస్పరము ఖండించుకొను స్థానమునందేర్పడిన బిందువులు. భూ చంద్రుల చలనమునుబట్టి యీ బిందువులు మారుచు రాశి సంచారము చేయుచున్నట్లు కనిపించును. ఈ బిందువు లెప్పుడు నొకదానికొకటి 180° దూరమందుండును. ఇవి సూర్య భూ చంద్రుల పరస్పర స్థితి సంబంధములను తెలియజేయుచు గ్రహణముల పరిగణించుట కుపయోగించును. పౌరాణికమైన రాహు కేతువులకథ నిజమా యబద్ధమా యనునది మన కిచ్చట యప్రస్తుతము. ఈ బిందువులే నిజమైన గ్రహణ కారణములని మన జ్యోతిష్కులకు తెలియు ననుటలో నావంతయు సందేహములేదు. జ్యోతిష్కుడీ జన్మ పత్రికను ముందుంచుకొని భవిష్యమును చెప్పుటకు మొదలుపెట్టును. జన్మకాలమందలి గ్రహస్థితిని సూచించు చక్రమే జన్మపత్రిక. కాని ఈ చక్రములో సూచింపబడిన గ్రహస్థితి సంపూర్ణమైన లెక్కతో గూడినదికాదు. అది యేరాశిలో యేగ్రహమున్నది మాత్రమే సూచించును. కుజుడు కన్యారాశిలో నున్నాడని మాత్రమే దానియందుండును. సరిగా యే బిందువునొద్ద నున్నాడో, యెన్ని డిగ్రీల యెన్ని నిమిషముల, యెన్ని సెకండులు గడిచినాడో అది చెప్పదు. కాని జాగ్రత్తగా వేసిన జన్మ పత్రికయందీ సామగ్రియంతయు సమకూర్ప వచ్చును. ఈ సామగ్రియంతయు లేనప్పుడు జాతకుడు పుట్టిన స్థలము, కాలము, తేది సరిగా సూచింపబడవలెను. వానిని బట్టి కావలసిన వైనమంతయు జ్యోతిష్కుడు సిద్ధము జేసికొనును. జ్యోతిషము యెంత శాస్త్రీయమైనను ఈ వైనమంతయు లేనియెడల ఫలితములు స్థూలముగా నస్పష్టములుగా నుండును.

ఇది యిట్లుంచి జ్యోతిష్కునకు జాగరూకతయు లోకజ్ఞానము మిక్కిలి యవసరము. ఇవి లేనినాడతడెంత పండితుడైనను ఫలితములను సరిగా చెప్పలేడు. ఒకేసమయమున

ఒక మనుష్యుడును, కుక్కయు పుట్టియుండవచ్చును. అప్పుడు వాని జాతకములు రెండునూ సమానములే. అప్పుడు వట్టి శాస్త్రజ్ఞానము ఫలితములను చెప్పుటకు చాలదు. జాతకమునుబట్టి జాతకుడు తిర్యక్కో, మనుష్యుడో చెప్పవచ్చునేమో నాకు తెలియదు. కాని ఫలితములను సరిగా చెప్పుటకు జ్యోతిష్కునకు లోకజ్ఞానము తప్పనిసరియని మాత్రము నేను చెప్పగలను. మీలో చాలమంది Loius De Wohl 'The stars of war and peace' యను గ్రంథమును చదివి యుండవచ్చును. ఈ గ్రంథకర్త రెండవ ప్రపంచ యుద్ధకాలమందు ఆంగ్లప్రభుత్వమునకు అనధికార జ్యోతిష్కుడు, Psychological Researeh Bureau కు అధిపతిగా నుండువాడు. యుద్ధకాలలో కెప్టెన్‌పదవిలోనుండువాడు. కాని అతనిపని యుద్ధమును గురించి జోస్యమును చెప్పుటమాత్రమే. హిట్లరు జ్యోతిష్కులు చెప్పుచున్న జోస్యమును గురించి, వానికి సైనిక విన్యాసములను గురించి యాంగ్లప్రభుత్వమునకు నివేదించుటకు మాత్రమే యాతనికి పై యుద్యోగము లిచ్చిరి. అతడీపనియంతయు సమర్థముగా నిర్వహించెను. హిట్లర్ యుద్ధపుఎత్తులలో చాలా భాగము అతడు జోస్యము చెప్పగలిగినాడు. అతని జోస్యమునుబట్టి యాంగ్లేయులా యెత్తులకు పై యెత్తులు వేయగలిగిరి.

మరియొక యుదాహరణము. 'EL-Alamein' యుద్ధమునకు కొంచెము కాలముముందు 'De Wohl' కు దేశకాల నిర్ణయములేని రెండు జాతకములనిచ్చి ఆ జాతకములలో నెవరు గెలుచునని యడిగిరి; వారిచ్చిన సామగ్రినుండి వలసిన సైనమంతయు సిద్ధము చేసికొనుట యసాధ్యము. కాని యతడు ఉజ్జాయింపుగా లెక్కగట్టుకొని నవంబరు 17 న జనించిన జాతకుడు జయించునని చెప్పెను. అంతేకాదాతడాంగ్లేయుడని చెప్పెను. ఈ సంగతి De-wohl కెట్లు తెలియును? అతడు ఆంగ్ల దేశాధిపతి యొక్కయు, చర్చిల్ యొక్కయు, జాతకములలో ఆకాలము చాల యోగకాలమని యెరుగును. సరిగా నదే కాలమునకు హిట్లర్ జాతకమునకు నవయోగమున్నది. అందుచేత నా కాలమునందు జరుగు యుద్ధములో గెలుచు జాతక మాంగ్లేయునిదై యుండవలయునని యాతడూహించెను. అతనియూహ సత్యమే. ఆ జాతకము 'జనరల్ మాంటు గోమరీ'ది కాని, ఈ కథలో నున్న చిత్ర మేమనగా మాంటు గోమరీ జాతక మతడు జయించునని చెప్పగా ఆ రెండవవారెవరో యోడిపోవునని చెప్పుటకు వీలుగాలేదు. 'మాంటు గోమరీ' జయించునుగాని అతని ప్రతిస్పర్థి యోడిపోడు అని డివాల్ చెప్పెను. ఈ జోస్యము చిత్రముగాలేదా? దీనికికారణ మేమియో అప్పుడు చెప్పుట దుర్ఘటము, యుద్ధానంతరము మాత్రమే యా కారణము తెలిసికొనుటకు వీలైనది. ఈ రెండవవాడు జర్మన్ సైన్యాధికారి జనరల్ రోమెల్. హిట్లర్ జ్యోతిష్కులుగూడ మాంటు గోమరీ జయించునని చెప్పిరి. అందుచేత రోమెల్‌ను అప్రతిష్ఠ పడకుండ, హిట్లరు యుద్ధము జరుగుటకు రెండు మూడు రోజులముందు జర్మనీకి పిలిపించెను. ఇట్లు మాంట్ గోమరీ జయించుట, రోమెల్ ఓడిపోకుండుట తటస్థించినది.

14-12-1958.

౨

జాతక భాగమునకు సిద్ధాంతభాగము మూలము. సిద్ధాంత భాగము లేనిచో జాతకభాగము లేదు. సిద్ధాంతి సిద్ధము చేసిన పంచాంగముపై జ్యోతిష్కుడాధారపడియుండును. అంతేగాని తాను స్వయముగ గ్రహగతులను గణనము చేసికొనడు. సిద్ధాంతి ఇచ్చిన లోగట్టా నతడంగీకరించును. గ్రహగతులను లెక్కకట్టుటలో చిన్న పొరపాటున్నచో జ్యోతిష్కుని జోస్యపు లెక్కలన్నియు తబ్బిబ్బగును. భారతీయ జ్యోతిష్యమునందు సాయన నిరయన పద్ధతులలో దేనినవలంబించవలెనను వాదమున్నది. సూర్యునిరాశి సంచారకాలమునందు ప్రతిసంవత్సరము కొంత భేదము గలదు. సూర్యుడు పూర్వ సంవత్సరమునందు విషువత్తును చేరుకొనుట కెంతకాలము పట్టెనో తర్వాత సంవత్సరమునందు దానికంటె కొంచెము తక్కువకాలము పట్టును. వసంత విషువత్తుతో ఒక సంవత్సరము ప్రారంభమైనది. అప్పుడు సరిగా సూర్యుడు మేష రాశియందు ప్రవేశించెను. జరిగిన పదమూడు సంవత్సరములలో మూడువారముల తేడా వచ్చినది. పూర్వముకంటె ఇప్పుడు సూర్యుడు శరద్విషువత్తును మూడువారములు ముందు చేరుకొనుచున్నాడు. భారతీయ జ్యోతిశ్శాస్త్రవేత్తలీ విషయ మెరుగుదురు. కాని జాతకభాగమందు మాత్రము దీనిని గణనములోనికి తీసుకొనలేదు. పదమూడువందల సంవత్సరములకు పూర్వము వసంతవిషువద్దినముకంటె ఇప్పటి వసంత విషువద్దినము ఇరువదియొక్క దినములు ముందు వచ్చుచున్నది. మకరసంక్రాంతిని మనము జనవరి 13, 14 తేదీలలో జరుపుచున్నాము. నిజమునకు సూర్యుడు జనవరి 25 వ తేదీన మకరమునందు ప్రవేశించుచున్నాడు. ఈ భేదమును గమనించక చేయు గణితములు సరియైన ఫలితము లిచ్చుననుట సందేహాస్పదము. పాశ్చాత్య జాతకవేత్తలు పంచాంగములమీద నాధారపడక స్వయముగా గ్రహములను పర్యవేక్షించుకొందురు. భారతీయ జాతకవేత్తలు వారి పద్ధతిని సమర్థించుకొనుచు ఒక సిద్ధాంతమును నిర్మించిరి.

అదియే నిరయన సిద్ధాంతము. జాతకవేత్త ఆధారపడు మరి యొక శాస్త్రము గణితము. గణిత శాస్త్రవేత్త వేసిన లెక్కల పట్టియు జాతకవేత్త యుపయోగించుకొనును.

మఱి జాతకమునందు వాడు పరిభాష యున్నది. ఈ పరిభాష క్రొత్తవారికి తికమకగా నుండును. కొందరాలోచన లేనివారిందువలన దీనిని పరిహసింతురు. ప్రపంచకమునందు జరుగుచున్న ప్రతి సంఘటనము అది ప్రకృతికి సంబంధించినను మనుష్యునికి సంబంధించినను గ్రహచారము వలన సంభవించినదని జ్యోతిష్కులు వారి యనుయాయులు చెప్పుదురు. అనగా గ్రహచారము మనుష్య జీవితముపై తన ప్రభావమును చూపించుచున్నదన్నమాట. ఈ ప్రభావమను మాటయందు ఉద్దిష్టార్థముకంటె, కొంచె రెక్కువ యర్థమును తీసికొందురు. అందుచేత గ్రహస్థితికి సంబంధించిన సంఘటన మేమియో స్పష్టము చేయవలయును. నేను పూర్వము చెప్పిన గ్రంథకర్త సూర్యునిచేత భూమి తప్తమగుట గ్రహస్థితివలన నని చెప్పినాడు. ఆ విధముగనే చంద్రుడు ఒకానొక రాశియందున్నప్పుడు సముద్ర ముప్పొంగునని చెప్పవచ్చును, అట్లే కొన్ని వ్యాధులు ప్రబలుటకూడ. వాయురోగములు చంద్రునియొక్క గతికి సంబంధించినవి. మానసిక రోగములు అగ్ని పర్వతములు బ్రద్దలగుటకు పూర్వము పశు పక్ష్యాదుల ప్రవర్తనలోగల మార్పులు వీనికి సూర్యకుటుంబమునందున్న క్షుద్ర గ్రహముల స్థితి కారణము. వాతావరణ సూచి వాతావరణమునుగూర్చి చెప్పినట్లు గ్రహసంపుటి మనుష్యులయొక్క జీవితమును గురించి చెప్పును. బరామీటరు రాగల మూడు నాలుగు దినములలో వాతావరణ మెట్లుండునో మనకు చెప్పుచున్నదనగా, దాని యర్థ మది వాతావరణమును గనిపెట్టి మనకు చెప్పుచున్నదనిగాని దానిని పృష్టించుచున్నదనిగాదు. అట్లనుట అశాస్త్రీయ మగునుగదా. ఐనను గ్రహస్థితికి సంబంధించినంత వరకు ఈ కారణ మన్నమాట, ప్రభావమన్నమాట ఆ సంబంధముయొక్క స్వరూప మెట్టిదియైనను అట్టిమాటలు గ్రహస్థితికిని, భూమిపై గలుగు సంఘటనములకును నొక విధమైన సంబంధ మున్నదని చెప్పుట కుపయోగింప వచ్చును. ఆకసమునందు చంద్ర సూర్యుల బట్టి అనగా భూమికిని చంద్రునకును మధ్య చంద్రుడు వచ్చినప్పుడు సూర్య గ్రహణముగలుగుచున్నదిగదా. ఈగ్రహణ మెందుకుగలుగుచున్నది? ఆయా ప్రదేశములయందు సూర్యచంద్రులుండుట వలన, ఈ గ్రహణముయొక్క ప్రభావము మనకు తెలియును. దీనివలన సూక్ష్మతరమైన విద్యుదయస్కాంత క్రియా కలాపములయందు అంతరాయములు గలుగుచున్నవి. దీనివల్ల నాడీమండలమునకు, మనస్సుకు సంబంధించిన రోగములు గలుగుచున్నవి. ఇందుచేత ఆ యంత్రములయందలి అంతరాయములకు, ఈ వ్యాధులకు అట్టి చంద్రునిస్థితి కారణముగా చెప్పవచ్చునుగదా!

మఱియొక యుదాహరణమిత్తును. భూమికి కొంత ఎత్తున 'Iono sphere' అణువిశ్లథనస్కంధమున్నదని మనకు తెలియును. పదార్థ మందలి యణువుల విశ్లథనమువలన యది యేర్పడును. సూర్యగ్రహణ ప్రసారముయొక్కయు, యితరగ్రహ కిరణ ప్రసారములయొక్కయు ప్రేలుళ్ళవలన గొప్పశక్తి పుట్టును. అది పదార్థాణువులను విశ్లథ మొనరించును. మఱల యా యణువులను ఘనీభవింపజేయును. ఇట్టి విశ్లథీకరణము, సంపుటీకరణము ఇచ్చట నిరంతరము కొనసాగుచుండును. అనంతమైన కాలగతియందు ప్రకృతి తన స్థైర్యమును కోల్పోవలేదు. పైని చెప్పినట్లు అణువిశ్లథనస్కంధము రేడియో వాతావరణమునకు కారణమని మనకు తెలియును. రేడియో వాతావరణమనగా మన రేడియోలలోను ఇతర శబ్దగ్రహణయంత్రములలోను కలుగుగందరగోళము. ఇంతేగాక యీ యణువిశ్లథనస్కంధము సామాన్య వాతావరణమును కూడ కల్లోలపెట్టును. ఈ యణువిశ్లథనమునందు హఠాత్తుగా కలుగు పెద్దపెద్ద మార్పులు భూమిమీద యోషధులు, జంతువులు, బ్రతుకుటకు తగిన వాతావరణమును క్రిందుమీదు చేయగలవు. ఉత్తర ప్రదేశ రాష్ట్రమందలి రేడియోయధికారి శ్రీ సి. పి. జోషి భారతీయ రక్షకభటశాఖయొక్క వైర్లెస్ అధికారుల మహాసభయందు యీ పదార్థాణు విశ్లథనస్కంధమునందు నిత్యముగను నైమిత్తికముగను కలుగు మార్పులనుగురించి చక్కని యుపన్యాసమిచ్చినారు. ఈ మార్పులను గురించి ఆ యుపన్యాసమునందు మిక్కిలి యుపయోగకరమైన భోగట్టా కలదు. గ్రహణములు, సముద్రపు పొంగులు, వీనిపైన యీ అణుస్కంధముయొక్క ప్రభావమెట్టిదో విశదీకరించినారు. దీనినిగురించి యింకను పరిశోధనలు సాగుచున్నవి. ఈ యణువిశ్లథనస్కంధములోని మార్పులకు భూమిమీది మార్పులకు పరస్పర సంబంధము స్థాపితమైనచో అది తప్పక జ్యౌతిషకమైనదనియే చెప్పవచ్చునుగదా! గ్రహణము భూ చంద్రసూర్యుల పరస్పరస్థితి సంబంధములను సూచించును. ఈ పరస్పర స్థితిసంబంధము అణుస్కంధమందలి మార్పునుసూచించి తీరవలెను. ఈ మార్పు భూమిమీది ప్రాణులయొక్క భౌతిక, మానసిక పరివర్తనములను సూచించును.

ఈపైన చెప్పినదిట్లు చాల ముఖ్యమైన విషయము. ఐనను అది జాతకమునకు పీఠిక మాత్రమే. ప్రతి శాస్త్రమును ఋషి నిర్మితమని సంప్రదాయము. ఒక విధముగా చూచిన యది సత్యమే యనవచ్చును. కాని యీ భావమున కిప్పుడంత యుపయోగకారి కాదు. పైగా నిది అభివృద్ధి నిరోధకము గూడ. ఎందుచేతననగా యీ దృష్టి సంస్కరణమున కొప్పుకోదు. తక్కిన శాస్త్రముల మాదిరిగనే యీ జాతకవిద్య అనుభవముమీద యాధారపడి యుండవలెనని నా యభిప్రాయము. కాబట్టి మన మెప్పటికప్పుడు సరిపుచ్చుకొనుచుండ వలెను.

దీనిని వదలి అకృత బుద్ధులు చేయు తర్కపద్ధతి యొకటున్నది. దానిని, దీనిని జూచి మనము కలగాపులగముగా చేసి చూచుకొనరాదు. అకృతబుద్ధుల తర్కపద్ధతి యిట్లుండును. ఇది దీని తర్వాత జరిగినది కావున దాని తర్వాత నెల్లప్పుడిది జరిగితీర వలయును. అని వారి సిద్ధాంతము. ఒక సంఘటనమునకు పూర్వము మరియొక సంఘటనము జరిగినది కావున, ఈ సంఘటనము జరుగుటకు పూర్వ సంఘటనము కారణమనుట. దీనికి వారి యుదాహరణమిది. ఒక కుటుంబములో ఒకడు చనిపోకముం దొక తోకచుక్క రాలినది. అందుచేత తోకచుక్క రాలుట మృత్యువునకు కారణము. కాని యిది పరిశీలించినచో హేత్వాభాసగా తేలును. కార్య కారణ సంబంధము నిత్యముగా నుండవలెను. పైన చెప్పిన ధూమకేతు పతనము, మనుష్య మరణము, వీని మధ్య నిత్య సంబంధములేదు. లోకములో అన్ని చావులకు పూర్వము తోకచుక్క రాలుటలేదు. తోకచుక్క రాలినపుడెల్ల మనుష్యులు చనిపోవుటయులేదు. అందుచేత పైసిద్ధాంతము అతివ్యాప్త వ్యాప్తిదోష భూయిష్ఠమైనది.ఒకానొకచోట ఇవి రెండు సందర్భ పడినచో అది కాకతాళీయమే గాని పరస్పర సంబద్ధము గాదు.

కాని కొన్ని సంఘటనలు పరస్పర సంబద్ధములై జరుగ వచ్చును. ఇటువంటి సంఘటనములు బహుసంఖ్యాకముగ నున్నప్పుడు బహుకాలమునుండి జరుగుచున్నప్పుడు ఇవి పరస్పర సంబద్ధము కావనుట తార్కికుని లక్షణముగాదు. పూర్వాపరములకు, ఇచట కార్యకరణ సంబంధము నిత్యముగా కనిపించుచుండగా, దాని నంగీకరించుట బుద్ధిమంతుల లక్షణము. ఒకానొక రాశిలో నొకానొక గ్రహమున్నపుడు, ఒకానొక సంఘటనము జరుగుట సాధారణమైనచో, ఆ రాశియందాగ్రహముండుట ఆ సంఘటనమట్లు జరుగుటకు కారణమని చెప్పవచ్చును. ఇట్లు చెప్పుటయే తర్కపద్ధతి.

గ్రహములన్నింటిలో బుధ శుక్రులు ఒక రాశినుండి మరొకరాశికి త్వరగా మారుచుందురు. కాబట్టి భూమిమీద జరుగు సంఘటనలతో ఈ గ్రహములస్థితి ముడివేయుటంత తేలికపనిగాదు. కాని గురు శనులు మొదలగు గ్రహములొక్కొక్కరాశియందు చాలకాలముందురు. గురువు సంవత్సరమునకును శని రెండున్నర సంవత్సరములకును ఒక పర్యాయము రాశి మారుచుందురు. పరిశోధన చేయుటకు చాలినంతకాలమిది. పూర్వకాలమునందు ప్రప్రథమమున నీ గ్రహముల స్థితినిబట్టి పరీక్షలు కొనసాగించియుందురు. గ్రహస్థితికిని భూమిపై జరుగు సంఘటనలకును గల సహసంబంధమును సూచించుటకు బహూదాహరణములు కలవు.

రాయపూరు సైన్సుకాలేజ్ అధ్యాపకుడు డాక్టర్ గోర్ తన గ్రంథమునందు ఫిజిక్సు మొదలగు భౌతికశాస్త్ర విషయక పరిశోధనలు జాతకవిద్య నెట్లు సమర్థించుచున్నవో చక్కగ విమర్శించినాడు. హిందూదేశముయొక్క లగ్నము మకరమని అతని మతము. మకరమునకు సరిగా 180° దూరములో కర్కాటకమున్నది. 1946వ సంవత్సరము జూన్ నుండి 1948 జూలైవరకు శని కర్కాటకమందున్నాడు. ఈ కాలమువందు భారతదేశములో ముఖ్యమైన మూడు సంఘటనములు జరిగినవి— ఒకటి భారతదేశము స్వతంత్రమగుట, రెండు పాకిస్తాన్ అవతరణము, మూడు గాంధీ మహాత్ముని మరణము. ఈ కాలమునుండి వెనుకకు లెక్కవేసి డాక్టర్ గోర్ ముప్పది సంవత్సరముల కొకసారి రెండున్నర సంవత్సరముల కాలములో భారతదేశమువం దనేక ముఖ్య సంఘటనలు జరిగినట్లు ఋజువు చేసినాఁడు. శని ముప్పదిసంవత్సరముల కొకసారి రాశిచక్రము చుట్టివచ్చును. అందుచేత శని కర్కాటకరాశికి ముప్పది సంవత్సరముల కొక పర్యాయము వచ్చును. శని కర్కాటరాశియందున్నపుడెల్ల మన దేశమం దేదియో యొక ముఖ్యసంఘటనము సంభవించుచు వచ్చినది. డాక్టర్ గోర్ వంద సంవత్సరముల వెనుక వరకు వెళ్ళి ఋజువుచేసినాడు. నేను మరి నాలుగు వందల సంవత్సరములు వెనుకకు పోయి పరీక్షించితిని. ఎవరైనను యింకనూ వెనుకకు పోయి పరీక్షించవచ్చును. శని కర్కాటక స్థితుడైనప్పుడు భారతదేశమున నొక ముఖ్య సంఘటనము జరిగినట్లు ఋజువగును. కొన్ని యుదాహరణము లిచ్చెదను. 1917 మాంటేగ్ సంస్కరణలు, 1887 అఖిలభారత జాతీయ మహాసభావతరణము, 1857 ప్రథమ స్వాతంత్ర్యసమరము, 1767 మొదటి మైసూర్ యుద్ధము, 1707 ఔరంగజేబు మరణము, 1557 రెండవ పానిపత్ యుద్ధము, 1527 మొదటి పానిపత్ యుద్ధము, 1497 హిందూ

దేశమునకు వాస్కోడిగామా రాక. ఈ పైన యిచ్చిన యుదాహరణములన్నింట శని కర్కాటకస్థితుడై యున్నాడు. ఇచట రెండు ముఖ్య విషయములను గమనించవలెను. నేను ఇచట చెప్పిన సంఘటనము లన్నియు సమాన ప్రాధాన్యము గలవి గావు. రెండవది 1647 వ సంవత్సరమునందు యే సంఘటనము జరిగియుండలేదు. వీనికి కారణము తర్వాత వివరింతును.

ఈ శని కర్కాటక సంచారమును గురించి నేను పరిశోధన చేయుచుండగా మరొక విచిత్రమైన సంఘటనా పరంపర నాకు కన్పించినది. ఇవి పన్నెండు సంవత్సరముల అంతరముతో జరుగుచు వచ్చినవి. గురువు పండ్రెండు సంవత్సరముల కొకసారి రాశి చక్రము చుట్టివచ్చును. నేను 1942 తో ప్రారంభించి చూచితిని. అప్పుడు గురువు మీన రాశియందున్నాడు. 1942 వ సంవత్సరమునందు 'క్విట్ ఇండియా' యుద్యమము జరిగినదని మీకు తెలియును. ఇప్పటినుండి రెండువందల సంవత్సరములు వెనుకకుపోయి చూచితిని. కొన్ని యుదాహరణములీ దిగువ నిచ్చుచున్నాను. 1930 వ సంవత్సరములో లాహోరు మహాసభయందు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము, జగత్ప్రసిద్ధమైన యుప్పు సత్యాగ్రహము. 1906 లో వంగదేశ విభజన, 1858 లో ఈస్టిండియా కంపెనీ అంతమై బ్రిటిషురాణి పరిపాలన ప్రారంభమైనది. 1774 లో గవర్నర్ జనరల్ పదవి, వారన్ హేస్టింగ్సు మొదటి గవర్నర్ జనరలుగా నియమితుడయ్యెను. 1762 లో హైదరలీ విజృంభణము. ఇచ్చట గూడ కొన్ని సందర్భములలో ముఖ్య సంఘటన లేవియు జరుగకుండుటగాని, యేవియో చిన్నచిన్న సంఘటనలు జరుగుటగాని సంభవించుచు వచ్చినవి. పైగా నేను యిచ్చిన యీ సంవత్సరములన్నవే, అవి కేవలము ముఖ్యమైనవి మాత్రమే. గురువురాశి చక్రమును చుట్టి వచ్చుటకు పట్టు కాలము దాదాపు పన్నెండు సంవత్సరములుగాని సరిగా పన్నెండు సంవత్సరములుగాదు. అట్లే శనిరాశి చక్రము చుట్టివచ్చుటకు దాదాపు ముప్పది సంవత్సరములు పట్టును. కాబట్టి శని కర్కాటకమునందు గురువు, మీనమునందు నేను చెప్పిన కాలమునకు కొంచె మించుమించుగా నుండి యుండును. కొన్ని మాసముల వ్యత్యాసముండియుండవచ్చును. శని మకరమున కధిపతి. మకరమునకు కర్కాటకము సప్తమరాశి. 170° దూరము. గురువు మీనమున కధిపతి అని మనకు తెలియును.

పై జరిగిన సంఘటనములన్నియు సమాన ప్రాధాన్యము గలవిగావు. కొన్ని సందర్భములలో అసలే సంఘటనము జరుగలేదు. యెందుచేతనని యడిగినచో జ్యోతిష్కుడిట్లు సమాధానముచెప్పును. సూర్యకుటుంబములోని గ్రహములు గురు శను లిద్దరే కాదుగదా తక్కిన గ్రహము లింకను యున్నవి. వాని స్థితి గతులలోని భేదములనుబట్టి పై సంఘటనములు అట్లుజరుగుట సంభవించినవి. అని. ఈ సమాధాన మెంతయు సమంజసముగ లేదా ?

ఇట్లు భూమిపై జరుగు సంఘటనములకు గృహస్థితికిని పరస్పర సంబంధము గమనించుటయే జోస్యము చెప్పుటకు దోవతీసినది. ఈ పై యుదాహరణములను ఆయా యంతరముల యందు, ఆయాగృహము లాయా రాశులందున్నపుడు ఆయా సంఘటనములు తటస్థించుచుండుట సరిగా గమనించి నట్టివారు గురువు మీనసంచారము చేసినపుడెల్ల కొన్ని ముఖ్య సంఘటనలు భవిష్యత్తులో జరుగవచ్చునని చెప్ప వచ్చును. 1954, 1966, 1978 ఈ సంవత్సరములయందు గురువు మీనమునందుండునుగాబట్టి ఆయా కాలములయందు కొన్ని ముఖ్య సంఘటనములు జరుగవచ్చును. అట్లే శని కర్కాటక స్థితిని బట్టి 1977, 2007, 2037 సంవత్సరములో కొన్ని ముఖ్య సంఘటనములు జరుగవచ్చును. మరి ఈ రెండు సందర్భములు సమకూరినచో నా కాలమునందతి ముఖ్యమైన సంఘటనము జరుగవచ్చు ననవచ్చునుగదా ! రెండుదాహరణముల నిత్తును. 1857 నుండి 1858 వరకు గురువు మీనమందును, శని కర్కాటకమునందును ఉండుట తటస్థించినది. ఈ కాలమునందే ప్రథమ స్వాతంత్ర్యసమరము జరిగినది. ఇట్లే 1977 నుండి 1978 వరకును గురువు మీనమందును శని కర్కాటకమందుండుటతటస్థించును. అప్పుడు మన దేశమునందతిప్రధానమైనసంఘటనము జరుగవచ్చును.

ఈ సందర్భమున డాక్టర్ డీవాల్ చెప్పిన మరిరెండు ముఖ్యమైన జోస్యముల గురించి ప్రస్తావింతును. అతడు 1952 వ సంవత్సరములో ఒక పుస్తకము ప్రకటించినాడు. 1952 వ నవంబరులో శని వరుణులు 1945 వ జూలైలో నేయేప్రదేశములందుండిరో ఆయా ప్రదేశములందుండుట తటస్థించినది. 1945 లో శని వరుణుల ఈ పరస్పరస్థితి సంబంధమువలన మొదటి యాటంబాంబు ప్రేల్చబడినది. 1952 వ నవంబరులో కూడ యట్టి శని వరుణుల సంబంధము వలన 1945 లో జరిగినట్లుగానే మరల జరుగవచ్చునని డీవాల్ జోస్యము చెప్పినాడు. అతడు చెప్పినట్లే జరిగినది. 1952 నవంబర్ ఒకటవతేదీని మొదటి హైడ్రోజన్ బాంబు ప్రేల్చబడినది. అట్లే 1963 వ అక్టోబర్ నుండి 1964 జూలై వరకు పూర్వోక్త శని వరుణుల సంబంధ మేర్పడుచున్నది. అప్పుడు మహాఘోరమైన ప్రపంచ సంగ్రామము జరుగుట

కవకాశమున్నదని డీవాల్ జోస్యము చెప్పుచున్నాడు. గురువు యొక్క స్థితినిబట్టికూడ 1964 వ సంవత్సరము భారతదేశ మునకు చాల ముఖ్యమైనదని నేనుకూడ నిశ్చయమునకు వచ్చితిని.

౩

నేనింతవరకు చెప్పిన యుదాహరణములు ఒక జాతి జీవితమునకు సంబంధించినవి. ఇవి సత్యములగునో కాదో తెలిసికొనుట తేలికపని. కాని ప్రతి వ్యక్తియు తన భవిష్యత్తును గురించి, బంధువుల భవిష్యత్తును గురించి, తెలసికొన గోరును. జాతి జీవితము, వ్యక్తి జీవితములను బరిశీలించు పద్ధతి యుకటేగాని, వ్యక్తి జోస్యము చెప్పునప్పుడు, బహు వ్యక్తుల జీవితములను జాగ్రత్తగా పరిశీలింపవలసియుండును. గ్రహయోగ పరివర్తనాదికము జాగ్రత్తగా మదింపు చేసికొన వలసి యుండును.

ఇట్టి పరిశీలనముపైననే జాతకవిద్య యాధారపడియున్న దని నిస్సందేహముగా చెప్పగలము. భిన్నభిన్న పరిశీలకులు భిన్నదేశములయందు మిక్కిలి కుతూహలముతో బహు దీర్ఘకాలము పరిశోధనములను సాగించిరి. వారి పరిశీలనములు జోస్యములు నిజమగుచు వచ్చినవి. ఈ పరిశోధనా ఫలితములు జోస్యములు పరస్పరము పోల్చబడి సరిచేయ బడినవి. ఈ పరిశీలన సామగ్రినుండి క్రమముగా నొకపద్ధతి పరిణామము చెందినది. ఈ పద్ధతి మిక్కిలి దీర్ఘమైనది. కాని యట్టి శాస్త్రములయందు అడ్డుత్రోవలు త్రొక్కుట యంత లాభసాటిగాదు. కాని పని కొంచెము చురుకుగా కొనసాగింప వచ్చును. ఈ పరిశీలనామార్గమే ప్రాచీనకాలమునందు అవలంబింప బడినదనుటలో సందేహము లేదు. ఈ పద్ధతి పరిపూర్ణముగా సఫలమైనది. జాతకములను పరస్పరము పోల్చి చూచినచో నీవిషయము తెలియును. ఒకే వృత్తి గలవారియొక్క జాతకములనుగాని, సదృశ వృత్తుల జాతకములను గాని పోల్చి చూచినచో వారియందు సమానలక్షణములు కొన్ని యుండును. యేవియో కొన్ని కాకతాళీయములను వదలినచో ఈ జాతకములన్నింట నాయా రాశులందాయా గ్రహములొకేరీతినుండుట మనము గమనింతుము. ఇందుచేత ఆయా గ్రహస్థితులకు ఆయా జాతకుల వృత్తులకు పరస్పర సంబంధమున్నదని మనము గట్టిగా చెప్పవచ్చును గదా. అట్టి జాతకమే మనము చెప్పవలసి వచ్చినపుడా జాతకుడట్టివృత్తియే పరిగ్రహించునని మనము జోస్యము చెప్పినచో తప్పేమి ?

పరిశీలనా పరిశోధనముల వలన జోస్యము చెప్పుట అంత తేలికపని కాదు. గ్రహబలము నంతయు చక్కగ లెక్క కట్టుకొనవలయును. ఒక గ్రహము మీద మనము ఆధారపడి చెప్పుజోస్యము మరొక గ్రహముచే తారుమారు గావచ్చును. అదిగాక జాతక విద్య పెరుగుచున్న శాస్త్రము, జోస్యము సరిగా చెప్పుటకు వలసిన సామగ్రి యంతయు మనవద్దలేదు. ప్రముఖమైన యొక అంశమును వదలి లెక్కవేసినచో ఆ వేసిన లెక్కయంతయు తప్పిపోవును. 1934 సంవత్సరము జనవరి 15 వ నాడు బీహారులో జరిగిన భూకంపమును, దానివలన జరిగిన విపరీత నష్టములను మన మెరుగుదుము. ఆ సంవత్సరపు పంచాంగముల పెక్కింట ఈ జోస్యము స్పష్టముగా చెప్పబడినది. నాడు రవి, కుజ, బుధ, శుక్ర, శనులు మకరరాశియందు కూడిరి. నాటి సాయంకాలము 2 గం. 45 నిముషములకు చంద్రుడు మకరమునందు ప్రవేశించెను. ఈ షష్ఠగ్రహ కూటమునుబట్టి ఆ సమయమున కేదియో మహాపద సంభవించునని జ్యోతిష్కులు జోస్యము చెప్పిరి. సరిగ నదే సమయమునకు భూకంపము ప్రారంభమైనదని మన మెరుగుదుము. కాశీ హిందూ విశ్వ విద్యాలయమువారి విశ్వ పంచాంగమునందు కొన్ని రాష్ట్రములు భూకంపమునకు గురికావలసి వచ్చునని పేర్కొనబడినది. పంచాంగములట్లు చెప్పుట సరిగా ఆ కాలమునకట్లు జరుగుట యీ రెంటిని మనము జోడించుకొనవలెను. ఇది కాకతాళీయమని కొట్టివేయుటకంటె సాహస ముండదుగదా. కాని బెలూచిస్థానమునందు జరిగిన భూకంపమును గురించి ఎవరును ముందుగా జోస్యము చెప్పియుండలేదు. గ్రహములయందేదియో ముఖ్యాంశము సరిగా గమనింపబడక పోవుటయో, ఆ గ్రహకూటముయొక్క ప్రాముఖ్యము సరిగా గమనింపబడకుండుటయో కారణము గావచ్చును.

జాతకముచదువునప్పుడు ఒక ముఖ్యమైనప్రశ్న పుట్టును. అది ఫలితములు జరుగు కాలమును గురించిన ప్రశ్న. అకృతబుద్ధులగు జ్యోతిష్కులు తమ యసామర్థ్యమును కప్పిపుచ్చుకొనుటకు సంవత్సరములతరబడి కాలములో ఆయా ఫలితములు జరుగునని చెప్పుదురు. చార్లెస్‌కార్టర్ అను విద్వాంసుడు తామువ్రాసిన 'Symbolic Directions in Modern Astrology' అను గ్రంథమునందు సరిగా కాలమును నిర్దేశింపవలసిన యవసరమును (ముఖ్యముగా ఆపదల విషయములో) గురించి హెచ్చరించినాడు. ఆ హెచ్చరికలో నతడు 'వీలైనంతఖచ్చితముగా' యను మాటలనుపయోగించెను. ప్రతి వ్యక్తి జ్యోతిషిక కాలసూచి యంత్రములకు పరిపుచ్చబడిన కచ్చితమైన గడియారమును గలిగి యుండకపోవచ్చును. యత్కించిత్భేదమైనను గణితమునందు పెద్దభేదముతెచ్చి ఫలితములను తప్పుత్రోవలకీడ్చును.

ఇంతేకాక కార్టర్ చెప్పినట్లు మనుష్యుడొక సంవత్సరములోనో యొక నెలలోనో జరుగనున్న యాపదల గురించి ముందు జాగ్రత్త చూచుకొనుట విడిచి, వేరే పనిలేనివాడైనచో తప్పు యంత పట్టించుకొనడు. ఇంతేకాక ఆ యాపద వచ్చినదాని కంటె, వచ్చును, వచ్చుననుకొనుటలో బాధయెక్కువ. ఇంతే కాక ఒకడు తన నిత్యజీవితమంతయు, దినదిన మెట్లు జరుగునో గణించుచు కూర్చున్నచో వాని జీవితమంతయు జోస్యమువెంటబడి తిరుగుట తప్ప వేరుండదు. మనుష్య జీవితమును జ్యోతిశ్శాస్త్ర మపమార్గమునకు లాగునని నిరూపించు పద్ధతి యిది. అందుచేత నవసరమునుబట్టి దాని నుపయోగించుకొనుట వివేకలక్షణము.

నేనిక్కడ జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములను గురించి విమర్శించుకొనదలచలేదు. ఆ సిద్ధాంతములు చాల చిక్కులతో గూడినవి. వానిని వ్యాకరించుట మిగులకష్టము. జాతకమును వేయుట చాల తేలికయె. కాని దానిని వ్యాఖ్యానించుట చాల కష్టము. ఒక రాశియందొక గ్రహమున్నచో యేమిఫలితమో అదే రాశిలో మరొక గ్రహమున్నచో దానికి వ్యతిరేక ఫలితము జరుగవచ్చును. జ్యోతిష్కుడీ గ్రహములు చెప్పు ననుకూల వ్యతిరేక ఫలితములను లెక్కవేసికొని సగటు ఫలితములను కట్టుకొనవలెను. అతడు కొన్ని సిద్ధాంతముల మీద నాధారపడవచ్చును కాని మొత్తముమీద సిద్ధాంతముల కంటె అనుభవము, లోకజ్ఞానము నిట్టి సందర్భములో మిక్కిలి యుపయోగించును.

జాతకవిద్యయం దనేక భాగములు గలవు. రోగ విషయిక, మనో విషయిక జోస్యములు. వాతావరణ విషయిక జ్యోతిష్యము అనునది మరియొక భాగము. దీనిలో ఋతు పవనములకు సంబంధించినది మరీ ముఖ్యమైనది. ఆర్థిక కల్లోలములను చెప్పు భాగము మతొకటి. ఇట్లనంతముగా యీ శాస్త్రమున్నది. పూర్వకాలమున దేశ భవిష్యత్తును గురించి చెప్పుట ఇప్పటికంటె తేలికగా నుండెడిది. అప్పుడు రాజవంశీయుల జాతకములు పరిశీలించినచో జాలెడిది. ఇప్పుడిది చాలదు. ఎందుచేతననగా రాజపద్ధతి యమలులోనున్న దేశములలో కూడ రాజు పేరునకుమాత్రమే రాజు. ఈ పరిస్థితులలో జాతీయ జీవితమునకు సంబంధించి జోస్యము చెప్పుట యారంభమై, ఆ పద్ధతి క్రమముగా రూపొందుచున్నది.

జాతక సిద్ధాంతములను గూర్చి యిచట నేను చర్చించ దలచుకొనలేదు. దీనికి రెండు కారణములున్నవి. ఒకటి: నాకు తెలిసిన జ్యోతిష్యము చాల కొంచెము. రెండు: యీ సిద్ధాంతములమబట్టి ఫలితములనుచెప్పుట చాల కష్టమైనపని. ఏదో అభిమానముచేత, ఆ సిద్ధాంతములను బట్టి ఫలితము చెప్పినచో నా చెప్పుట యీ శాస్త్రము నప్రతిష్ఠపాలుచేయుట యగును. కాని ప్రసిద్ధులైన జ్యోతిష్కులు కొన్ని సరళము లైన గ్రంథములను వ్రాయకపోలేదు. జ్యోతిషాభిమానులకు అవిచక్కగా నుపయోగించును. అట్టిగ్రంథములలో C.B.O. Corter వ్రాసిన Symbolic Directions in Modern Astrology. జాతకము నెట్లు చదువవలెనో అందు బహుముఖముల చెప్పబడినది. ఆయుర్దాయము, మారకము మొదలగువానిని నిర్ణయించుటకు బహూపాయములు చెప్పబడినవి. ప్రసిద్ధమైన వారి జాతకములు ప్రస్తావితములైనవి. ఈ గ్రంథము పాశ్చాత్య జాతక పరిభాషయందున్నది. భారతీయ జాతక విధానమునుబట్టి బి. వి. రామన్‌గారి 'Studies in Gimini' అను గ్రంథ మట్టిదే.

ఈ జ్యోతిష్యమునకు ఆధ్యాత్మికార్థము గూడ నున్నది. విషయమునకంత పెద్ద సంబంధము లేకపోయినను దానిని గురించికూడ కొంత మచ్చటింతును. జ్యోతిషము ఫలితములతో సరిచూచుకొన్నచో సరిపోయిన దనుకొందము. అప్పుడు కేవలము విధినిర్ణయమునకు దాసులేకదా. ఆ విధి నిర్ణయము మంచిదికావచ్చు చెడుకావచ్చు. సుఖముకావచ్చు దుఃఖముకావచ్చు. మానవుడు దానికి తలయొగ్గవలసినదేగాని మీరలేడు. భారతీయ జ్యోతిశ్శాస్త్ర మీయభిప్రాయము నొప్పుకొనదు. ఆ నిర్ణయమనునది ఒకయదృష్టశక్తి కృతముగాదు. పరమేశ్వరకృత్యముగాదు. మనుష్యులభవిష్యత్తునందుజోక్యము కలిగించుకొను భగవంతుడు హిందూమతములోలేడు. మనుష్యునిభవిష్యత్తు అతని పూర్వకృత కర్మసంభూతమైనది. మనుష్యునిశరీరమనస్సంపుటిమీద అతనియాధ్యాత్మిక, ఆదిభౌతిక పరిస్థితుల యొక్కయు, పూర్వాపర జన్మముల యొక్కయు ముద్రయున్నది, అని యందరంగీకరింతురు. భారతీయ తత్వశాస్త్రమొక యడుగు ముందునకు పోయి మనుష్యుని పూర్వకృత కర్మమే యాయా పరిస్థితుల నట్లు నిర్ణయించునని చెప్పినది. అది భగవంతుని యుద్దేశమో, జన్మాంతర కృతకర్మమో యేదియైననేమి. దానిచేత అతని కరచరణములు బంధింపబడినవి, మఱి యతనికి స్వాతంత్ర్యములేదా? యున్నచో ఆ యున్న స్వాతంత్ర్యముయొక్క స్వరూపమది. వ్యష్టియొక్క యాత్మ పరమాత్మకంటె భిన్నమైనదిగాదు. వ్యష్టియొక్క యాత్మ సమష్టియొక్క యాత్మ రెండు నొకటే. సచ్చిదానంద స్వభావములే. వ్యష్టియొక్క ఆత్మ అవిద్యా వచ్ఛిన్నము. నిజమే. కాని యది యెల్లప్పుడవిద్యయం దుండదు. సామాన్యుల విషయమునందు అంతరాత్మయు

లోపల విషయములో మనస్సును తాదృశాత్మ భావమును ప్రత్యక్షీకరించుకొనుటకు చుట్టు నల్లుకొన్న బంధములు తెగగొట్టుకొనుటకు ననుక్షణము ప్రయత్నించుచునే యుండును. ఈ ప్రయత్నమునే పాశ్చాత్య తత్వవేత్తలు 'Free will' అన్నారు. ఇది వ్యక్తికి వ్యష్టికి స్వాతంత్ర్యేచ్ఛ. దీనికిని విధి నిర్ణయమునకును నిత్య సంఘర్షణము కొనసాగుచున్నది. ఈ సంఘర్షణా ఫలితములే మన ప్రయత్నములు. సామాన్య మానవునిలో నీ స్వాతంత్ర్యేచ్ఛ యంత బలముగా నుండదు. అందుచేత నతని జాతకమునుబట్టి చెప్పిన జ్యోస్యమున కనుకూలముగా అతని ప్రయత్నము లెక్కువ భాగము నడచుచుండును. బుద్ధిబలమును అధ్యాత్మికోన్నతియు సాధించిన వారి విషయములో యీ జాతక ఫలితములు వ్యత్యస్తము లగుచుండును. కాని స్థూలముగా వారి భవిష్యత్తుకూడ జాతకమును బట్టియే నడచును.

మఱియొక ముఖ్యమైన ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. గ్రహవీక్షణ మన్నమాట మనమెంతయో విశాలార్థమున వాడియుంటిమి. ఎంత విశాలార్థములో వాడినను మనుష్యుని ప్రయత్నములను గ్రహములెట్లు నడపునను ప్రశ్నయున్నది. ఈ ప్రశ్నకు నా సమాధానమిది. ఈ విశ్వమంతయు ఋతముచేత, సత్యముచేత పాలింపబడుచున్నది. ఈ రెండును ఒకే సత్పదార్థముయొక్క స్వరూపములు. ఋతమనగా ప్రాకృతికవిధి. సత్యమనగా ప్రవర్తనవిధి. మొదటిది భౌతిక ప్రపంచకమునకు, రెండవది అంతర ప్రపంచమునకు సంబంధించినది. భౌతికప్రపంచము మన దృష్టికి కనుపించునది. అంతర ప్రపంచము ఋషిదర్శనా సంవేద్యమైనది. ఈ భౌతిక ప్రపంచమునందొక పరిస్థితి యేర్పడినదనగా అది యేర్పడుటకు పూర్వమా అంతర జగత్తునందొక పరిస్థితి యేర్పడి యుండవలయును. ఈ బహిరంతర జగత్తునందలి పరిస్థితులకు సహభావనమున్నది. సాదృశ్యమున్నది. ఒకదానియందలి మార్పు, ఒకదానియందలి మార్పునకు ప్రతీక. మనకుమాత్రము భౌతిక పరిస్థితిని పరిశీలించుట తేలిక. దాని హేతువిచారము వట్టి యూహగా మాత్రమే భాసించును. అందుచేత మనము అనుభవముమీద యాధారపడి బాహిరమైన యీ పరిస్థితికి యాంతరమైన యీ హేతువును కనుగొనవలసి యున్నది. ఈ పద్ధతి మన వీలునుబట్టి యేర్పాటు చేసుకుంటిమి. న్యాయమునకు బాహ్యాంతర జగత్తులందలి పరిస్థితు లొకదానికొకటి సూచకములు. నేను చెప్పగలిగిన సమాధానమింతే. మరి బహిరంతర జగత్తులొకదానినొకటి ప్రతిబింబించుకొనునా యను విషయమును లెస్సగా పరిశోధింపవలయును.

జ్యోతిష్యమొక శాస్త్రమే యైనను పరిపూర్ణశాస్త్రము కాదంటిని. పరిణామమున కంతములేదు కాబట్టి పరిపూర్ణత యెక్కడిది, యను ప్రశ్నమున్నది నిజమే. కాని యీ విశ్వమంతయు సర్వాతిశయమును, సర్వవ్యాపకమునునై బహురూపముల వ్యక్తమగుచున్నట్టి ఒక నిర్ణీతమైన లక్ష్యము వంకకు నొక నిర్ణీతమైన మార్గమువెంట నొక సిద్ధికొఱకు నొక సంపూర్ణతకొఱకు ప్రయాణించుచున్న ఒకే శక్తియొక్క విలసనము కావచ్చును. లేక ఒక కల్లోలపరిస్థితినుండి హతాత్సముద్భూతమైన కార్యము గావచ్చును. కాక సచ్చిదానందాత్మకుడగు పరమాత్మ యీ సృష్టికంతకు మూలకారణమై నిత్యమై దానివంకకే యీ సర్వసృష్టియు ప్రయాణించుచుండవచ్చును. ఎవరును జెప్పలేరు.

జాతకవిద్య యొక్క యాథార్థ్యమును మీకు నచ్చచెప్పుటకు నేను ప్రయత్నము చేయలేదు. ఇతర శాస్త్రములవలెనే యీ జ్యోతిషము గూడ వ్యాసంగము చేయుటకు, పరిశోధన చేయుటకు యర్హమైనదని మాత్రమే నిరూపించుటకు ప్రయత్నించితిని. మనము తలచుకొన్నచో దాని నవహేళనము చేయవచ్చును. ఇట్టి యవహేళనము వలన మనుష్యజాతికి సుఖసంపాదకము కాదగ్గ యొక విద్యయొక్క యుపయోగమును మనము కోల్పోవుదుము. వాతావరణ శాస్త్రప్రయోగములకై మనము బహుద్రవ్యము వెచ్చించుచుంటిమిగదా! ఇంత ద్రవ్యమును వెచ్చించుచుండ జ్యోతిశ్శాస్త్రమునందు వాతావరణమును గుఱించి చెప్పబడిన పద్ధతులు ప్రయోగించి సరియైన ఫలితము లిచ్చునో లేదో యేల పరిశీలింపరాదు? అవి సాంతము తప్పు గావచ్చును. కాని యవి వేలకొలది సంవత్సరముల పరిశీలనపై యాధారపడియున్నవి. వాని యుపయోగితను పరిశీలింపక నిరాకరించుట వట్టి యజ్ఞానము.

జ్యోతిషము ఔషధశాస్త్రము వలె యెప్పటికప్పుడు పరిచూచుకొనదగినది. దాని ఫలితములతో అది సరిపోవునో లేదో, అది సత్యమో, యసత్యమో తేలికగా పరీక్షించుకొనవచ్చును. దానిని చదువకుండ, దాని సత్యాసత్యములతో నిమిత్తములేకుండ, నేవేవియో యూకును పోకను పొందని కారణములు చెప్పి, దానిని నిరాకరించుటకంటె నజ్ఞానము మఱియొకటిలేదు. జ్యోతిష్కులు వారిసిద్ధాంతములనుగురించి సరిగా వివరింపలేకపోయినను, వారు చెప్పిన ఫలితములు జరుగుచున్నంతకాలము జ్యోతిశ్శాస్త్రము యొక్క శాస్త్రీయతను మనము నిరసింపరాదు. భూమ్యాకర్షణ సూత్రము యొక్క యథార్థతను వివరింపలేకపోయి నప్పటికిని దాని నంగీకరించుచుంటిమిగదా!

అనువాదము: ధూళిపాళ శ్రీరామమూర్తి

# ఒక్క కప్పు టీ | కాథరీన్ మాన్స్ఫీల్డు*

ఆమె - రోజ్ మేరీ ఫెల్ - అచ్చంగా సౌందర్యవతి అనడానికి వీల్లేదు. నిజం. మీ రామెను సౌందర్యవతి క్రింద జమకట్టలేరు. పోనీ అందకత్తె అంటేనో? అంగాంగ పరిశీలన గావిస్తే... కాని, ఎవరైనా సరే అల్లా పరిశీలన మొదలుపెట్టడమన్నది చాలా ఘోరం. నిజంగా న్యాయంకాదది. ఆమె మంచి వయస్సులో ఉన్నది. చాలా తెలివిగలది. ఎంతో నాగరీకమైన మనిషామె. గొప్పగా వస్త్రధారణ చేస్తుంది. అత్యాధునిక గ్రంథాలనుకొనే వాటి నన్నిటినీ ఆమె తుణ్ణంగా చదివేసింది. గొప్పగొప్ప కళాకారులు - రకరకాల వ్యక్తులు - తప్పకుండా పరిచయం చేసుకోవలసిన వాళ్ళు - చాలా సరదా మనుష్యులు - ఎంతోమందిని పిలిచి ఆమె తరచు విందులు ఏర్పాటుచేస్తూ ఉంటుంది. ఆ విందులు నిజంగా ఎన్నతగినవే.

ఆమెకు వివాహమైన రెండేళ్ళకు ఓ కుమారుడు కలిగాడు. ఆ కుఱ్ఱాడి పేరు మైకేల్. ఆమె భర్త ఆమెను నిజంగా ఆరాధిస్తాడూ అంటే నమ్మండి. వాళ్ళు భాగ్యవంతులు. చాలా భాగ్యవంతులు - జీవితం ఏదో సుఖంగా గడిపేందుకు సరిపడి ఉన్న భాగ్యం కాదు వాళ్ళది. ఇంకా గొప్ప భాగ్యం.

ఏమైనా వస్తువులు కొనుక్కొందామని అనిపించిందా ఆమె ఇక సరాసరి - మీరూ నేనూ అవసరమైనప్పుడు బాండ్ వీధికి వెళ్ళినట్లుగా - పారిస్ వెళుతుంది. పువ్వులు కొనుక్కోవాలని మనసుపడిందనుకోండి - వెంటనే కార్లో బయలుదేరిందన్నమాటే. ఆవిడగారి కారు రీజెంటు వీథిలో సరిగ్గా ఏది పెద్ద పువ్వుల దుకాణమో అక్కడే ఆగుతుంది. మరోచోటా మరోచోటా ఆగదా కారు.

ఆమె దర్జాగా, క్రొత్తగా, ఆశ్చర్యంగా కాని ఎంతో సహజంగా అలా తొంగిచూస్తుంది షాపులోకి. చూస్తూనే "అదుగో అవి ఆ మూల ఉన్నాయే, అవి ఇవ్వండి. అవి ఓ నాల్గుగుత్తులు ఇవ్వండి. ఆ గులాబీ పువ్వులు పూలకుండీలో ఉంచారే, అవి, అవన్నీ నాకు కావాలి. ఆఁ వద్దు. నాకు వాటివంక చూస్తేనే అసహ్యం పేస్తుంది. వాటికసలు ఆకారం కూడా లేదు" అంటుందామె. అప్పటిదాకా ఆవిడ మాటలన్నీ శ్రద్ధగా ఆలకిస్తున్న ఆ షాపు యజమాని అభివాదపూర్వకంగా తలవంచి నిజంగా ఆ పూలు అసహ్యాకరంగా, నిరాకారంగా ఉండే పూలైనట్లుగా, ఆమె నిజంగా సత్యంచెప్పినట్లుగా నటిస్తూ, ఆ పూలు కన్పించకుండా అవతలగా, లోపలగా దాచేస్తాడు.

అంతలో ఆమె "ఒత్తుగా ఉన్న ఆ కలువపూలు ఎఱ్ఱ కలువలూ, తెల్ల కలువలూ రెండురకాలూ ఇవ్వండి" అల్లా చెప్పి ఆవిడ వెనుతిరిగి తన కారు దగ్గరకు వెళుతుంటే ఆ షాపులో దాసీ పిల్ల బక్కపల్చగా ఉండే చిన్నది పెద్ద కాగితంలో ఆమెగారు కోరిన పూలన్నీ పొట్లంగట్టి తీసుకొనివస్తుంది. ఆ పొట్లం, పసిపాపను పొత్తిళ్ళతో పాటు జాగ్రత్తగా ఎత్తుకొని వస్తున్నట్లుగా రెండుచేతులపైనా పెట్టుకొని నెమ్మదిగా ఎంతో వినయంగా ఆమె వెంట వెళుతుంది. శీతాకాలపు రోజుల్లో ఒకనాటి మధ్యా

---

* జననం అక్టోబర్ 1888. మరణం, 1923. అంత చిన్నవయస్సులోనే ఇంగ్లీషుభాషలో అత్యుత్తమ కథానికలను ఆమె రచించింది.

హ్నాం కర్జన్ వీథిలో విచిత్రవస్తువుల అమ్మే ఒక దుకాణంలో రోజ్ మెరీ ఏదో కొంటున్నది. ఆమెకు చాలా ఇష్టమైనదుకాణమే అది. అదీగాక ఆ కొట్టు యజమానికిఆమెఅంటే ఎంతో గౌరవంకూడానూ. ఆమె కాయావస్తువులు అమ్మడం అంటే అతనికి ఎంత ఉబలాటమో చెప్పలేము. ఆమె దుకాణం లోకి అడుగుపెట్టడం ఆలస్యం ముఖం ఇంత అవుతుంది. ముఖం వికసిస్తుందనుకోండి. చేతులు కట్టుకొని వినయంగా కన్పిస్తాడామె అక్కడ ఉన్నంత సేపూ. దాదాపు నోట మాట రానంతగా ఆనందపరవశుడవుతాడు. అదంగా ఆమెనుఉబ్బించ డానికి చేసే యత్నం-పోగడ్త - కావచ్చు - ఏమో! కాని అందులో ఏదో చమత్కారం ఉన్నది.

"చూశారూ" అంటూ మర్యాదగా, తగ్గు స్వరంతో, నెమ్మదిగా వివరించడం మొదలు పెట్టి "నా వస్తువు అంటే నాకు ఎంతో ఆపేక్ష ఉన్నది సుమండీ. వాటిని చూచి హృదయ పూర్వ కంగా అభినందించలేని వాళ్ళకు, వాటియందు నిజమైన గౌరవం అభిమానం లేనివాళ్లకు వాటి నమ్మడం కంటె నా దగ్గర ఉంచేసుకోడానికే ఇష్ట పడతాను. సున్నిత స్వభావం - కళాత్మకదృష్టి ఇవి చాలా అరుదుగా కన్పిస్తాయి. అయినా అటు వంటి దృష్టి లేనివాళ్లకు వీటిని అమ్మడం నాకు బొత్తిగా ఇష్టంలేదు. అల్లా అంటూ ఒకసారి గట్టిగా గాలి పీల్చుకొంటూ వెల్వెటు గుడ్డ చుట్టిన పాకెటు ఒకటి గాజు అద్దమున్న కౌంటరుమీద విప్పుతూ, నిడువుగా కొంచెం పాలినట్లుగా ఉన్న వేళ్ళతో దానిపైన రాస్తూ ఉండిపోయాడాయన.

ఇవ్వాళ ఆయన చూపదల్చుకొన్నది ఒక చిన్న పెట్టి. దాన్ని ఆమెకోసరమే దాచిపెట్టి ఉంచా డాయన. ఇంతవరకు దాన్ని మరొకరికి చూపను కూడా చూపలేదు. చాలా అందమైన ఎనామెల్ పెట్టె అది. పైభాగం వెండిపూత ఉన్నట్లు తళతళ మెరుస్తున్నది. ఆపెట్టెమూతపై వికసిత పుష్ప విరా జితమైన ఒక చిన్న వృక్షం. ఆ వృక్షచ్ఛాయలో ఒక అందాలశిల్ప కన్య నిలిచి ఉన్నది. ఆ చిన్ని శిల్పం ప్రక్కగా మరో విగ్రహం కూడా ఉన్నది. అతగాడు ఆ శిలాతరళాక్షి బాహుబంధంలో పరవశుడైపోయి నట్లు కన్పించాడు. ఆమెతలపైన ఒకచిన్నదొరటోపీ కూడా ఉన్నది. ఆ చిన్న టోపీచుట్టూ రిబ్బను కూడా చుట్టిఉన్నది. ఈ శిల్పాలపైన - వారిద్దరకు పైగా ఊదారంగు మబ్బు తునక చిత్రితమైంది. ఆ మేఘశకల స్వరూపం చాలా చిత్రంగా, ఆ ప్రేమి లకును పరిశీలిస్తున్న దేవతలా ఉన్నది.

వస్తు పరిశీలన చేసేటప్పుడు చేతికున్న రబ్బరు తొడుగులు విప్పేయడం ఆమెకు అలవాటు. ఆ పెట్టెను తాకుతూ పరిశీలించే ముందు రబ్బరు తొడగులను త్వరగా విప్పుకొన్నదామె. ఆమె దృష్టిని అది నిజంగా ఆకర్షించింది. దానియందు ఆమెకు అభిమానం కలిగింది. ఆమె కంటికి అది ఒక నిధిలాగున కన్పించింది. అది తాను పుచ్చు కోక తప్పదనుకొన్నదామె. ఆ పెట్టెను చేత్తో ఎత్తి పట్టుకొని అటూ ఇటూ తిప్పుతూ మూత తెరిచి మళ్ళీ మూస్తూ ఉన్నప్పుడు ఆ వెల్వెటు వస్త్రం పైన - ఆ వస్త్రం ముందు తన చేతులు ఎంత అందంగాకన్పిస్తున్నాయో గమనించుకొన్నదామె. ఆ కొట్టు యజమాని మనస్సులో కూడా - ఎక్కడో ఏ మూలలో ఇటువంటి భావనే మొలకెత్తి ఉండ వచ్చును. ఆయన ధైర్యంచేసి ఆమె చేతుల్నిగురించి ఆలోచన చేస్తూ ఉండవచ్చు. ఎందుకంటే కౌంటరు మీద అందంగా పుష్టిని ప్రదర్శిస్తూ మెదులు తున్న ఆమె వేళ్ళపైపుకు ఆయన పొడుగాటి, రక్త విహీనంగా ఉన్న వేళ్ళు అప్రయత్నంగా కదులు తున్నాయి. ఆయన నెమ్మదిగా "అదుగో! ఆపువ్వులు మీరు అన్యథా భావించకుండా ఉంటే అవి చూపు తాను" ఆయన ఆ మాటలు ఆమె దృష్టిని తన వైపుకు త్రిప్పుకోడానికి అన్నట్లున్నారు. ఆమె ఆ విషయం గమనించి కూడా "అవా - వాటికేం? చాలా అందంగా ఉన్నాయి" అంటూ రోజ్ మెరీ ఆ పూలను మెచ్చుకొన్నది. ఒక క్షణంపాటు ఆ

కొట్టు యజమాని ఆమె మాటలు విన్పించుకొన్నట్లు లేదు. ఆతర్వాత ఆయన నెమ్మదిగా గొణిగాడు "ఇరవైఎనిమిది గినీలుమాత్రమే నండీ".

"ఇరవైఎనిమిది గినీలు. సరే" అన్నదామె ఏ విధమైన భావనా, ఆశ్చర్యం ప్రకటించలేదు. ఆమె నెమ్మదిగా ఆ చిన్న పెట్టెను క్రింద పెట్టింది. రబ్బరు తొడుగులు మరల తొడుగుకున్నది.

ఇరవై ఎన్మిది గినీలు! భాగ్యవంతు లయితే మట్టుకూ అంత పెద్ద మొత్తము!...ఆమెముఖంలో ఏ భావమూ కన్పించలేదు. వెనక వైపు ఎత్తుగా బీరువా పైన ఉన్న టీకెటిల్ వంక చూస్తూ అస్పష్టంగా పలుకుతున్నట్లుగా "మంచిది - మంచిది అది నాకోసం ఉంచండి - ఉంచుతారు కదూ" అన్నది. ఆ మాటలు అల్లా స్పష్టాస్పష్టంగా విన్పించి విన్పించగానే - ఉంచమని ఆమెగారు అనడంకంటె ఆశింపదగ్గ విషయం మరోటి లేదన్నట్లుగా వినయంగా నమస్కరించి చేతులు కట్టుకొని నిలబడ్డాడు. ఆయన వాలకం చూస్తే ఆ పెట్టెను ఆమెగారి కొరకు ఎప్పటికీ అట్టే పెట్టగలడు సుమా అన్నట్లు కన్పించాడు.

చలికాలంలో మధ్యాహ్న సమయమది. సన్నగా వర్షం కురుస్తున్నది. పైగా అప్పుడే చీకట్లు కూడా వ్యాపిస్తున్నాయి. చల్లని గాలి వీస్తున్నది. ఆ శీతవాయువులో ఏదో ఘాటుతనం కూడా మిళితమై ఉన్నది. ఆమె అదంతా గమనిస్తూనే కొట్టు తలుపు తెరుచుకొని బయటకు వచ్చింది - అప్పుడే మెట్ల మీదకు కూడా వచ్చేసింది.

అప్పుడే వెలిగించిన దీపాలుఎందుకో విచారంగా ఉన్నట్లు కన్పిస్తున్నాయి. ఎదుర్గా ఉన్న ఇండ్లల్లో దీపాలుకూడాఅట్లాగే ఉన్నాయి. ఆవైపుగా వీథిలో మనుష్యులు త్వరత్వరగా వెళుతున్నారు, వస్తున్నారు. అసహ్యంగా ఉన్న గొడుగులు వేసుకొని వాళ్ళు అలా నడిచిపోతున్నారు. ఆమెకో క్రొత్త ఆవేదన కలిగింది. అరచేతులతోగుండెల్ని హత్తుకొన్నది. ఆ చిన్న పెట్టెకూడా అప్పుడే తనదగ్గర ఉంటే బాగుండుననుకొన్నది... సరే ఆమె కారు అక్కడే ఉన్నది. కారుదగ్గరకు వెళ్ళడానికి కాస్త కాలిబాటను దాటవలసి ఉన్నది. కాని ఎందుకో ఆమె ఒక్క క్షణం ఆగింది. "తమ ఇళ్ళల్లోంచి బయటకువచ్చి, బయటప్రపంచాన్ని దర్శించినప్పుడు, పరిశీలించినప్పుడు ప్రతివారికీ కొన్నిక్షణాలు-కొన్ని భయంకరక్షణాలు ఎదురవుతుంటాయి. అవి నిజంగా అతిభయంకరమైనవే. వాళ్ళంతా వాటికి తల ఒగ్గవలసిందే. వాళ్ళు అప్పుడిక ఇంటికి వెళ్ళి మరోకప్పు టీ అవసరంగా పుచ్చుకొని శాంతపడవలసిందే, కాని..." సరిగ్గా అల్లా అనుకొంటున్న క్షణంలోనే అరె ఇది ఎక్కణ్ణించి వచ్చిందీ అని అనుకొంటున్న క్షణంలో ఒక్కపల్గా నల్లగాఉన్న పిల్ల నీడలా దగ్గరగా మోచేతి వెనగ్గా నిల్చున్న ఓ వయస్సులో ఉన్న అమ్మాయి కన్పించింది. నిట్టూర్పులా విన్పిస్తున్న - కాదు దుఃఖంలో ఉన్నప్పుడు విన్పిస్తున్న సన్నని గొంతుకతో ఆ అమ్మాయి నెమ్మదిగా "అమ్మగారూ తమతో ఒక్క క్షణం, ఒక్క సంగతి మనవిచేసుకోవచ్చునా?" అన్నది. భయపడుతూ అన్నట్లుగానే అనేసింది.

"ఏమిటో చెప్పు."

అల్లా అంటూనే రోజ్‌మెరీ వెనక్కు తిరిగింది. ఆ పిల్ల కళ్ళు విశాలమైనవి. తనకంటె ఎక్కువ వయస్సేమీ లేదనుకొన్నదామె. చాలా బాధలు పడిన పిల్లలా కన్పించిందామెకు. ఎఱ్ఱవారిన చేతులతో కోటు కాలరు బలంగా పట్టుకొని గజగజా వణికి పోతున్న ఒక అమ్మాయి కన్పించింది. ఆ అమ్మాయి అప్పుడే చల్లటి నీళ్ళల్లోంచి బయట పడినట్లుగా, రావిఆకు గాలికి రెపరెపలాడు తున్నట్లుగా, చలికి తట్టుకోలేక నిలువునా వణికి పోతున్నది. "అమ్మగారూ......" ఆ అమ్మాయి నట్టుతూ మాట్లాడడం ఆరంభించి " ఓ కప్పు టీ నీళ్ళకు డబ్బులిస్తారూ..." అని అడగడం పూర్తి చేసింది. "ఒక కప్పు టీ!" ఆ స్వరంలో ఏదో నిజాయితీ ఉన్నది. ఆ స్వరంలో బిచ్చగత్తె పోకడ

ఒక్క రవ్వకూడా లేదు. రోజ్ మేరీ ఎంతో ఆశ్చర్యపడుతూ "నీదగ్గర అసలు డబ్బులేదా" అన్నది. అందుకా అందుకా అమ్మాయి "ఏమీ లేదమ్మగారూ" అని సమాధానం చెప్పింది.

"అరె! ఎంత విచిత్రం!" రోజ్ మేరీ చీకటిలోకి చూస్తూ అన్నది. అంతలో ఆమెవైపు తిరిగి వింతగా చూచింది. ఆమెకా విషయం ఎంతో అసాధారణంగా కన్పించింది. నిజం - రోజ్ మేరీకి హఠాత్తుగా ఆ విషయం - ఆ సంఘటన ఒక సాహసోపేతమైన విషయంగా - సంఘటనగా - కన్పించింది. "డాస్టవిస్కీ"నవలలోని ఏదో ఒకానొకసన్నివేశంలా ఉన్న దామెకు. తాను ఆ పిల్లను చీకట్లో ఇట్లా అనుకోకుండా కలుసుకోవడ మదీ తను పుస్తకాలలో చదువుతూ ఉండే, రంగస్థలంపై చూస్తుండే విషయమే. సరిగ్గా అల్లాటి పనే తాను నిజంగా చేస్తే ఏమవుతుందో ఊహించుకోవడం మొదలు పెట్టిందామె. "ఓ మహాగొప్పగా ఉంటుంది. హృదయం స్పందిస్తుంది...ఆ తర్వాత ఈవిషయం నా స్నేహితులంతా ఆశ్చర్యచకితులై వింటుండగా నేను - ఆమెను .... అంతే సరాసరి ఇంటికి తీసికెళ్ళిపోయాను .... "అనుకొన్నదామె. అల్లా అనుకొంటూ ఆ పిల్లతో "నాతోపాటు టీకి మాయింటికిరా" అన్నదామె. అల్లాఅంటున్నప్పుడు ముందు ముందు తన మిత్రులతో "అంతే ఆమెను సరాసరి ఇంటికి తీసికెళ్ళి పోయాను" అని చెప్ప గలనని ఆమె అనుకొన్న మాటలు అప్పుడే అంటున్నట్లుగా అనిపించిందామెకు,

ఆ మాటలు విని ఆ పిల్ల ఆశ్చర్యపడిపోయింది. వెనక్కు తగ్గింది. క్షణకాలం ఆమె వణుకు కూడా ఆగింది. రోజ్ మేరీ చెయ్యి ముందుకుచాపి ఆ పిల్ల చేతిని మృదువుగా స్పృశించింది. "నేను రమ్మనమనే అంటున్నాను." ఆమె లాలనగా చూస్తూ చిరునవ్వు నవ్వుతూ స్పష్టీకరించింది.

"ఎందుకు జంకుతావు! తప్పకుండా రా - నాతోపాటు నా కారులో ఇంటికి వచ్చి - ఓ కప్పు టీ త్రాగుదువు గాని" అన్నది ఆ పిల్లకు భయం పోగొట్టడానికి.

కాని ఆ పిల్ల "మీరు నిజంగా రమ్మనడం లేదు. కదండీ!" అన్నది. ఆ స్వరంలో బాధ స్పష్టంగా కన్పిస్తున్నది. అందుకు రోజ్ మేరీ "రమ్మనే అంటున్నా - నువ్వు తప్పక రావాలి. కనీసం నన్ను సంతోషపెట్టడానికైనా రా. రా నాతో వచ్చేయ్" అన్నది. ఆ మాటలు విని ఆ పిల్ల వేళ్ళు పెదవులపై ఉంచుకొంటూ ఏదో అందామని అనుకొంటూ ఆగిపోయింది. మరో క్షణం తర్వాత ఆవిడ వంక తేరి పారచూచింది. చూస్తూ "మీరు నన్ను పోలీసుల దగ్గరకు తీసుకొని పోవడం లేదుగదా?" నట్టుతూ, భయపడుతూ అడిగిందా పిల్ల.

"పోలీసుల దగ్గరకా!" పెద్దగా నవ్వేసింది రోజ్ మేరీ నవ్వుతూ "అబ్బే! నే నెందుకు అంత క్రోధంగా ప్రవర్తిస్తాను? నిన్ను ఇంటికి తీసికెళ్ళి కాస్త సౌఖ్యాన్ని చేకూర్చి నువ్వేమైనా చెబితే విందామని అనుకొంటున్నా. అంతే" అన్నది. ఆకలితో ఉన్నవాళ్ళను బహుసులభంగా వెంటతీసుకొని పోవచ్చును. నౌకరు కారు తలుపుతెరచి వినయంగా నిల్చొని ఆమెను లోనికి ఆహ్వానించాడు. మరో క్షణం తర్వాత వారిద్దరు చీకట్లను దూసుకొంటూ గృహోన్ముఖులై పోతున్నారు. "చూశావూ"అన్నది రోజ్ మేరీ నెమ్మదిగా ఆమెకు గర్వభావమిళితమైన ఏదో విచిత్రానందం కలిగింది. తను వలపన్ని తెచ్చిన ఆ పిల్లవంక అల్లా ఆనందంతో చూస్తూ "నువ్వు నావశమైనావు." అని అనేశేదే కాని అనలేదు. ఆ విషయం చాల నెమ్మదిగా తన హృదయంలో కలిగిన దయను వ్యక్తీకరిస్తూ చెబుదామనుకొన్నది. "అమ్మాయి - చూశావూ జీవితంలో చాలా వింత విషయాలు సంభవిస్తుంటాయి. అనుకోకుండా ఇలా నాలాగా ఎదురయ్యే వాళ్ళే చివరకు నిజమైన ఆత్మీయులవుతారు......భాగ్యవంతులకు కూడా హృదయాలుంటాయమ్మా... స్త్రీలందరూ అక్కచెల్లెళ్లు" అని ఆ పిల్లకు చెప్పి ఆ

విషయం రుజువు చేద్దామనుకొన్నదామె. అల్లా అనుకొంటూ అప్రయత్నంగా ఆ పిల్లవంక తిరిగి "భయపడకు - అసలు నువ్వు నిజానికి నాతో ఎందుకురాకూడదూ? మనమిద్దరమూ ఆడవాళ్ళం- కాకపోతే నేను కాస్త ఉన్నదాన్ని. అదృష్టవశాన నేనేదో కాస్త భాగ్యవంతురాల్ని అవడం తటస్థించి నప్పుడు నువ్వు ఏ మని ఆశించాలీ అంటే......" ఆ వాక్యం ఎల్లా పూర్తిచేయబోతున్నదో నిజానికి ఆమెకే తెలియదు. ఆమె ఒక గండంలో పడ్డట్టే అయ్యింది. కాని ఆ గండం గడపటానికే అన్నట్లు, దైవికంగా సరిగ్గా ఆ క్షణానికే ఆమెకారు ఆగింది ఒక చిరుగంట మోగింది. నౌకరు వచ్చి తలుపు తెరిచాడు. విలాసంగా, ఒయ్యారంగా మళ్ళీ ఎంతో జాగ్రత్తగా ఆమె కారు దిగి ఆ పిల్లను నెమ్మదిగా హాల్లోకి తీసుకొనివెళ్ళింది. వెచ్చగా, మెత్తగా కాంతిమంతంగా, సువాసనలతో కూడి నదిగా...నిజానికి తనకెంతో పరిచయమున్న - కాని దాన్ని గురించి తాను ఎన్నడూ ఆలోచించని-ఆ వాతావరణాన్ని తన వెంటవచ్చిన పిల్ల వింతగా గమనించడమూ, తన ఇంటి సౌఖ్యాన్ని ఆ పిల్ల అందుకోవడాన్నీ రోజ్ మెరీ గుర్తించింది. "రా పైకి వెళదాంరా!" అన్నది రోజ్ మెరీ దయామృతాన్ని ఆ పిల్లపై కురిపించాలని. ఆమె అప్పుడే తొందర పడ్డది. "వెళదాం పద పైన నా గదిఉన్నది అక్కడికి వెళదాం" అన్నది మళ్ళీ అంతలోనే. ఆ పిల్లను త్వరగా పైకి తీసుకొనిపోవడం వల్ల నౌకర్లూ వాళ్ళంతా ఆ పిల్లవంక ఎగబడి చూడడమదీ తప్పుతుంది. అటువంటి బాధ ఆ పిల్లకు కలుగకుండా చేద్దామనే ఆమె అంత తొందరపడ్డది.

మెట్లెక్కి వాళ్ళిద్దరూ పైకి వెళ్ళారు. వారు ఆవిడ పడకగదికి వెళ్ళారు. ఆ గది ముఖద్వారానికి సిల్కు తెర కట్టబడిఉన్నది. లోపల నెగడు లోంచి సన్నని జ్వాలలు పైకి ఎగసి తమ కాంతి మూలకంగా అక్కడఉన్న సామగ్రిఅంతా కన్పింప చేస్తున్నాయి. మెత్తని సోఫాలూ, రంగురంగుల రగ్గులూ ఆ జ్వాలల కాంతిలో స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఆ పిల్ల వచ్చి లోపలగా నిలబడిపోయింది. ఆ పిల్ల చాలా ఆశ్చర్యపడిపోతున్నది. కాని అదేమీ రోజ్ మెరీ గమనించినట్లు లేదు.

ఆవిడ ఒక పెద్ద కుర్చీని నెగడుకు దగ్గరగాలాగి "రా - ఇలా రా - ఇలా కూర్చో - ఈ కుర్చీలో కూర్చుని ముందు చలికాచుకో - చలికి మరీ వణికి పోతున్నావు. ముందా బాధ తొలగించుకో."

ఆ పిల్ల వెనక్కు తగ్గుతూ "నాకు ధైర్యం చాలడంలేదండీ" అన్నది. "అబ్బే - ఏం పర్వాలేదు - రా" అంటూ రోజ్ మెరీ చప్పున వచ్చి "నువ్వుభయపడకు - నువ్వు ఏమీ భయపడకూడదు. నేను ఒక్క క్షణంలో కోటు అదీ విప్పుకొన్నాక మనం ప్రక్క గదిలోకి వెళ్ళి టీ తాగి హాయిగా మాట్లాడుకొందాం - అయినా నీకు భయందేనికి ?" అంటూ ఆమెను ఆ కుర్చీలో కూర్చోపెట్టింది. ఆ పిల్ల ఏమీ మాట్లాడలేదు.

చేతులు పొట్టమీద పెట్టుకొని, నోరు సగం తెరుచుకొని అల్లా చూస్తూ ఉండిపోయింది. రోజ్ మెరీ దగ్గరగా నిలబడి, ఆ పిల్లపైకి కొంచెంగా ఒరగపడుతూ నెమ్మదిగా "హేటు తీసేసుకోవూ - అందమైన నీ కురులన్నీ తడిముద్దలైనాయి - ఇంట్లో ఉన్నప్పుడు ఎవరికైనా హేటు తీసేసు కొంటేనే బాగుంటుంది కదూ ?" అన్నదామె నెమ్మదిగా. "అల్లాగే నండీ".

ఆ పిల్ల ఏదో రహస్యంగా అంటున్నట్లుగా అన్నదా మాటలు. అల్లా అన్నాక తన నలిగిపోయిన హేటు తీసేసుకొన్నది.

"మంచి పనిచేశావు...ఆ కోటు విప్పేసుకోవడానికి నేను సాయంచేస్తానుండు" అన్నది రోజ్ మెరీ.

ఆ మాటమీద ఆ పిల్ల లేచి నిలబడ్డది. కాని ఇంకా ఆ కుర్చీ చేతిని ఆ పిల్ల ఒక చేత్తో పట్టుకొనే ఉన్నది. అల్లా నిలబడి ఆమెను కోటు విప్పేయ నిచ్చింది.

అందుకు ఎంతో ప్రయత్నం చెయ్యవలసేవచ్చింది. కోటూ, హేటూ ప్రక్కగా నేలమీద వదిలేశాక ఆమె వెళ్ళి సిగరెట్టు పెట్టె తెరిచి సిగరెట్టు ముట్టించుకొన్నది. ఆ సమయంలో ఆ పిల్ల తొందరగా, ఎంతో సన్నగా "క్షమించండి. కాని నాకు శోష వచ్చేలాగున్నది. వెంటనే నాకేదో ఇంత ఇప్పించకపోతే ఇంక ఇక్కడ ఉండలేను" అన్నది.

నిజంసుమా - అరెరే ఎంత పొరపాటైపోయిందీ నేను ఎంత ఆలోచనా రహితంగా, ఎంత మందమతిగా ప్రవర్తించానూ!" అంటూ ఆమె గంట కొట్టడానికి ముందుకు చరచరా వెళ్ళింది. "టీ వెంటనే టీ కావాలి. కొంచెం బ్రాందీ కూడా కావాలి." ఆమె ఆజ్ఞలు జారీ చేసింది. నౌకరు పిల్ల అక్కడకు రావడం వెళ్ళడం కూడా ఒక్క క్షణంలో గడిచిపోయింది. కాని అది చూచి కూడా పెద్దగా, దాదాపు అరుస్తున్నట్లుగా "అబ్బే నాకు బ్రాందీ అక్కర్లేదండీ - నేను ఎప్పుడూ తాగను - నాకు కావలసిందల్లా ఒక్క కప్పు టీ - ఒక్క కప్పు టీ ఇప్పించండి." అంటూ ఆ పిల్ల దుఃఖం ఆపుకోలేకపోయింది. కన్నీరు పొంగి వచ్చింది. ఆ క్షణం చాలా విచిత్రమైంది.

హృదయాన్ని స్పందింపచేసే క్షణమది. నిజంగా బాధ కలిగించే క్షణం అది. రోజ్ మేరీ ఆ పిల్ల ప్రక్కగా మోకరిల్లింది. "అబ్బే - అల్లా ఏడవకు - ఏడవకూడదు. ఎందుకూ అంత ఇదవుతావూ?" అంటూ ఆమె తన లేసు అల్లికగల చేతిరుమాలును ఆ పిల్లకు అందించింది. ఆమెకు నిజంగా ఎంతో జాలికలిగింది. బలహీనంగావున్న ఆపిల్లభుజాలచుట్టూ తన చేతులువేసి ఆమెను లాలించింది. కొన్ని క్షణాల తర్వాత ఆ పిల్ల "ఈ విధంగా నేను బ్రతకలేను - సహించలేను - భరించలేను ఈ పాడు జీవితం వెంటనే అంతంచేసుకొంటా" అంటూ ఏడ్పు ఆపుకోలేక పోయింది.

రోజ్ మేరీ ఆ పిల్లను మరింత దగ్గరగా లాక్కొంటూ నెమ్మదిగా "చూడూ - నీకా అవసరమేమీ లేదులే—నీ విషయం నేను చూస్తాను. ముందు నువ్వు ఏడ్పు మానెయ్యి. ఇంక విచారపడకు. ఇకముందు నీకేమీ భయం అక్కర్లేదు. చూశావా మరి నువ్వు నన్ను కలుసుకోవడం ఎంత మంచి పనయ్యిందో!. సరె సరె - ఇక మనం టీ తాగేద్దాం—అప్పుడు నీ విషయం అంతా చెబుదువుగాని. నీకు నే నేదో మంచి ఏర్పాటు చేస్తాను. చేస్తానని ఇప్పుడే వాగ్దానం చేస్తున్నాగా - ఊ! మరి ఏడవకు - ఊ! నామాట వినుమరి."

సరిగ్గా మరో నిముషంలో దాసీది టీ తెస్తుందనగా ఆ పిల్ల ఏడ్పు మానేసింది. రోజ్ మేరీ లేచి అక్కడ ఉన్న చిన్న బల్ల తమ ఇద్దరకూ మధ్యగా అమర్చింది. దాని మీద టీ కప్పులూ, రొట్టీ, వెన్నా, బిస్కట్లూ పెట్టి వెళ్ళింది దాసీది. మీగడా, పంచదారా వేసి కప్పునిండుగా ఇస్తుంటే ఆ పిల్ల కప్పు తర్వాత మరోకప్పు ఖాళీచేసింది. అల్లా తేనీరు అందిస్తూ రోజ్ మేరీ తను చూస్తున్నట్లు కనుక ఆపిల్ల గమనిస్తే, ఆ పిల్ల ఎక్కడ సిగ్గుపడుతుందోనని ఎక్కడ మొహమాట పడుతుందోనని మరోవైపు చూస్తున్నట్లుగా నటిస్తూ - సిగరెట్టు త్రాగుతూ కూర్చుంది. తనుమట్టుకు ఆమేమీ తినలేదు. తాగలేదు.

ఆ చిన్న విందువల్ల సత్ఫలితమే కన్పించింది. మరికొంత సేపయ్యాక దాసీది వచ్చి ఖాళీకప్పులూ పళ్ళాలూ పట్టుకొని పోయింది. దాసీది వెళ్ళాక రోజ్ మేరీ ఒకసారి ఆ పిల్లవంక చూచింది. అప్పుడా పిల్ల ఎంతో క్రొత్తగా కన్పించింది. వంకులు తిరిగిన జుట్టూ - ఎఱ్ఱని పెదవులూ - ప్రకాశవంతమైన కళ్ళూ - పల్చని అందమైన పిల్లలా కన్పించింది. ఆ పిల్ల ఆకర్షణీయంగా కూడా కన్పించిందామెకు. ఆ కుర్చీలో వెనక్కు వాలి, హాయిగా విశ్రాంతిగా కూర్చుని, నెగడు మంటవంక చూస్తున్నదాపిల్ల. రోజ్ మేరీ మళ్ళా ఇంకొక సిగరెట్టు ముట్టించి - గొంతు సవరించుకొన్నది. "ఇంక ఇప్పుడు అడగవచ్చు" అనుకొంటూ నెమ్మదిగా "నువ్వు భోజనం చేసి ఎన్నాళ్ళయింది?" అని ప్రశ్నించింది.

ఆ పిల్ల సమాధానం చెప్పడానికి వీలులేక పోయింది. ఎందుకంటే అంతలోనే గడియ చప్పుడయ్యింది, "రోజ్ మేరీ నేను లోపలికి రావచ్చా?"అని బయటనుండి అడిగాడు ఫిలిప్. రోజ్ మేరీ "ఆ" అన్నది భర్త ప్రశ్నకు వెంటనే సమాధానంగా.

ఆయన లోనికి వచ్చారు. "అరె - మరేమి అనుకోకండి" అని ఆగిపోయి వారివంక కొంచెం ఆశ్చర్యంగా చూచాడు. రోజ్ మేరీ చిరునవ్వు నవ్వుతూ ఏమీ విశేషంలేదు. ఈమె నా స్నేహితురాలు. "పేరు"...అని తడుముకొంటుండగా ఆపిల్ల అందుకొని "స్మిత్ అండీ" అన్నది. ఆ పిల్ల ప్రశాంతంగా, కొంత నిర్భయంగా కన్పించింది. అల్లా ఆ పిల్ల అందిస్తే అందుకొని రోజ్ మేరీ "ఆ. అవును ఆమె పేరు మిస్ స్మిత్ - నా స్నేహితురాలు మేం ఏదో మాట్లాడుకో బోతున్నాం". అంటూ భర్త వంక అర్థవంతంగా చూచింది.

"ఓహో - సరే - మంచిది" అన్నారాయన. అంతలో నేలమీదపడిఉన్న కోటూ, హేటూ ఆయనకు కనిపించాయి. ఆయన నెమ్మదిగా నెగడువద్దకు వెళ్ళి వాటిని చూడనట్లు నటిస్తూ వెనుతిరిగి నిల్చున్నారు. "మధ్యాహ్నమంతా మహా పాడుగా ఉన్నది" అంటూ ఆయన ఆ పిల్లవంకా, ఆ పిల్ల చేతులవంకా, బూట్లవంకా చూచారు. అటుతర్వాత రోజ్ మేరీ వంక చూచారు.

"అవును - అవునుకదూ? చాలా పాడుగానే ఉన్నది" - అన్నది రోజ్ మేరీ పైకి ఉత్సాహంగానే. సహజమృదులమైన తన చిరునవ్వును పెదవులపై మలచుకొంటూ ఫిలిప్ నెమ్మదిగా "నువ్వొక్కసారి మన లైబ్రరీ గదిలోకి వస్తే... ఒక్కక్షణం ఈ అంతరాయానికి మిస్ స్మిత్ క్షమిస్తుందనుకొంటాను" అన్నారాయన ఎంతో గౌరవాన్ని సూచిస్తూ.

పెద్ద కళ్ళు ఎత్తి ఆ పిల్ల ఆయనవంక చూచింది. ఇంతలో రోజ్ మేరీ ఆ పిల్లతరఫున "ఓ! తప్పకుండా క్షమిస్తుంది" అని సమాధానం చెప్పి లేచి నిలబడి "మరి పదండి" అన్నది భర్తతో. మరుక్షణంలో వాళ్ళిద్దరూ కలిసి బయటకు వెళ్ళిపోయారు.

ఏకాంతంచిక్కగానే "ఏమిటిదంతా? ఎవరామె- ఈ వ్యవహారమంతా ఏమిటి? దీని అర్థం ఏమిటో చెప్పు" అని అడిగాడు రోజ్ మేరీ భర్త.

ఆమె నవ్వుతూ, తలుపుకు చేరగిలబడి నిల్చొని, నెమ్మదిగా "కర్జన్ వీధిలో కన్పించింది. నిజంగా. ఆ పిల్ల నన్ను ఒక్క కప్పు టీ డబ్బులు దానం చెయ్యమని బ్రతిమిలాడింది. ఆ పళంగా ఇంటికి తీసుకొచ్చేశాను."

"అది సరే - ఇక నువ్వావిడను ఏం చెయ్యబోతున్నావేమిటి?" కొంచెం పెద్దగా కేకలు వేస్తున్నట్లుగా అన్నాడాయన. రోజ్ మేరీ అందుకు సమాధానం చెప్పకుండా" "ఆ పిల్ల యెడల మీరు కాస్త నయంగాఉండండి - దయగా ఎల్లా ఉండాలో నాకు సరిగా తెలియడం లేదు....మేమింకా అసలు మాట్లాడుకోలేదు...మీ రామెను సరిగా చూడాలి" అంటూ ఆమె ఏదో చెప్పబోతుంటే ఆయన మందలిస్తున్నట్లుగా "ఓసి వెర్రిదానా! నీ కేమైనా పిచ్చెత్తిందా ఏమిటి? అటువంటి దేమీ జరగడానికి వీల్లేదు. అది అంతే - తెలిసిందా?" అన్నారు.

"మీరు ఇల్లా అంటారని నాకు తెలుసు - కాని ఎందుకు దయగా చూడకూడదూ? నాకది ఇష్టం. నేను అల్లా చెయ్యాలనుకొంటున్నాను-ఆ కారణం చాలదూ? అదీ గాక ఇల్లాంటి సంగతులు పుస్తకాల్లో అక్కడా చదువుతుంటాం కదూ?... అది ఏమైనా ఈ విషయంలో నేను ఒక నిర్ణయానికి వచ్చేశాను."

"కాని" అంటూ ఫిలిఫ్ ఒక్క క్షణం ఆగి చుట్టమొన కత్తిరించుకొంటూ నెమ్మదిగా "ఆమె చాలా అందంగా ఉన్నదే!" అన్నాడు.

"అందంగానా!" ఆమె ఎంతో ఆశ్చర్యపడ్డది. ఆమె చెక్కిళ్ళు ఎఱ్ఱబడినాయి.

"మీరు నిజంగా అనుకొంటున్నారా...నే నా విషయం ఆలోచించలేదే!" అన్నదామె. అగ్గిపుల్ల గీస్తూ ఫిలిప్ "ఆమె నిజంగా ఎంతో అందంగా ఉన్నది. ఆమె వంక నువ్వు మళ్ళీ ఒక్కసారి చూడు నీకే తెలుస్తుంది. నేను ఇందాక గదిలోకి అడుగుపెట్టి అటుచూచి నిర్ఘాంతపడిపోయాను....సరే. ఏమైనా నువ్వు పెద్ద పొరపాటు చేస్తున్నావు. నేను కొంచెం కఠినంగా మాట్లాడానని మరేమీ అనుకోవద్దు. సరే. ఇప్పుడా స్మిత్...శ్రీమతిగారితో నేను సహపంక్తిని భోజనం చెయ్యవలసివస్తోందా? చెప్పు. ముందుగా చెప్పకపోతే అందుకు కావలసిన ఏర్పాట్లు చేసుకోవద్దూ?" అన్నారు. అందుకు "సర్లెండి మీ మాటలూ మీరున్నూ" అన్నది రోజ్ మేరీ. అల్లా అనేసి ఆమె ఆగదిలోనుండి బయటకు వెళ్ళింది. కాని ఆవెళ్లడం తన పడకగదికి కాదు. తాను ఉత్తరాలు వ్రాసుకొనే గదికి వెళ్ళింది సరాసరి. అల్లా వెళ్ళి బల్ల ముందు కూర్చున్నది ఏదో ఆలోచిస్తూ "ఆమె అందంగా ఉన్నది!—నిజంగా అందంగా ఉన్నది! నిర్ఘాంత పడిపోయాను!"

ఆమె గుండె దడదడా కొట్టుకొన్నది.

"అందం! సౌందర్యం!"

చెక్కు పుస్తకం బయటకు తీసిందామె. కాని చెక్కు వల్ల ఏమిటి ప్రయోజనం అనుకొని వెంటనే బల్ల సొరుగు లాగి అయిదు పౌండ్ల నోట్లు తీసింది. ఆమె వాటివంక ఒకసారి అలా చూచింది. అంతలో ఏమనుకున్నదో ఏమో, వాటిల్లో రెండు తిరిగి సొరుగులో పడేసి మిగతా మూడు నోట్లూ చేత్తో పట్టుకొన్నది. వాటిని వేళ్ళతో కొంచెం నలిపింది. ఆమె నెమ్మదిగా తన పడకగదికి వెళ్ళింది.

అర గంట తర్వాత రోజ్ మేరీ తిరిగి వచ్చేసరికి ఆమె భర్త ఇంకా ఆ లైబ్రరీ గదిలోనే ఉన్నాడు.

ఆమె తలుపుకు ఆనుకొని నిలబడి "ఆ పిల్ల మనతో భోజనానికి ఉండదులెండి-మీకు ఆ విషయమే చెబుదామని ..." అని ఆగిందామె. ఫిలిప్ తాను చదువుతున్న పత్రిక ప్రక్కన పెట్టేస్తూ "ఏం ఎందుకని? ఇంతకుముందే ఎవరితోనైనా ఒప్పందం చేసుకొందా?" అని అడిగారు.

రోజ్ మెరీ ఒయ్యారంగా ముందుకు వచ్చి ఆయన తొడపై కూర్చున్నది. కూర్చుని నెమ్మదిగా "వెళ్ళకతప్పదని పంతంపట్టింది... అందుకని ఆ బీదపిల్లకు కొంచెం డబ్బుఇచ్చాను. ఆ పిల్ల ఇష్టాన్ని కాదని ఉంచలేక పొయ్యాను. ఇష్టంలేనప్పుడు నిజానికి ఆ పిల్లను అసి ఉంచగల నంటారా?" అని అడిగిందామె.

ఆమె చక్కగా జుట్టు దువ్వుకొన్నది.

అందమైన ఖరీదైన ముత్యాలహారం పెట్టుకొన్నది. ఆమె చేతులెత్తి - వేళ్ళతో ఆయన చెంపలను మృదువుగా తాకింది. అల్లా ఆయన చెంపల్ని స్పృశిస్తూ బాధగా, కొంచెం రుద్ధమైన సన్నని మధుర కంఠంతో ఆమె "నేనంటే మీకిష్టమేనా?" అని అడిగింది.

ఫిలిప్ ఆమెను కౌగిలిలోకి మరింత బలంగా పొదువుకొంటూ "చాలా ఇష్టం - ఏదీ ఒక్క ముద్దు...." అన్నాడు!

ఒక్క క్షణం నిశ్శబ్దం.

రోజ్ మేరీ ఏదో ఆలోచిస్తున్నట్లుగా మాట్లాడింది. "ఇవ్వాళ నాకో కొట్లో ఒక మంచి అందమైన పెట్టె కన్పించింది. చిన్న దంతపు పెట్టె. దాని ఖరీదు ఇరవై ఎనిమిది గినీలు. అంతే ఏమంత ఎక్కువ కాదు. అది నేను కొనుక్కోనా?"

ఆమెను దగ్గరగా తీసుకొంటూ "కొనుక్కో. డబ్బు వృధాచెయ్యడం నీ కలవాటేగా - తీసుకో" అన్నాడాయన.

కాని రోజ్ మేరీ అడగాలని - కాదు - అనాలని అనుకొన్న విషయం అదికాదు.

ఆయన తలను తన వక్షానికి హత్తుకొంటూ ఆయనను ఏదో రహస్యం అడుగుతున్నట్లుగా నెమ్మదిగా అడిగింది "నేను అందంగా ఉన్నానా?"

— అనువాదం : మురయా.

# ఓంకార శంఖము*

మధునాపంతుల
సత్యనారాయణశాస్త్రి

అతులోదార తరంగభద్ర సుగుణోద్యత్తుంగభద్రానదీ
తతపూతాంబువులందు సోదరులకై దండన్ మహీదేవతో
దిత సంకల్పపురస్సరంబయినభక్తిన్ స్నాతుఁడై నైష్ఠిక
వ్రతుఁడై మంగళదైవత ద్విజసమర్చల్ తీర్చి యుత్సాహియై.

చేతశ్శుద్ధి యొనర్చుకో నుపవసించెన్ తేఁడు నాఁడెల్ల శ్ర
ద్ధా తాత్పర్యములన్ శ్రుతిస్మృతులబోధంబుల్ పురాణాగమ
ఖ్యాతంబుల్ కథలున్ సుశిక్షితములౌ నాన్వీక్షికీ కల్పగో
ష్ఠీతంత్రంబుల నాలకింపుచు భజించెన్ సాత్త్వికాచారమున్.

హైందవేతర విమతధార్ష్ట్యమ్ముకతన
వాఁడి కడుపెండి నవసి యల్లాడుచున్న
యాంధ్రకర్ణాటరమకు సుధాన్నభిక్ష
వాని యొకనాఁటిపూర్ణోపవాసదీక్ష.

హరిహరుండు తెలవాఱుజాము శంకువు నెలకొల్పులగ్నంబగుట దొలినాఁటటు ఉపవసించి గురూక్తవిధానంబునంగడపి యూరేయి జాగరణం బొనరించె; వేఁబోక సుముహూర్తంబు దరియుటయు——

అమృతనిర్ఝరతరంగములుగా బొంగారి
చదలంటు మంగళస్వనము వెంట
నెఱవిచ్చు పసిఁడితామరపూలనిగ్గైన
తెనుఁగు కన్నడపుటంగనల వెంట
బ్రహ్మబిందు సముత్కారము పదక్రమముతో
ఘనమైన స్వస్తివాచనము వెంట
అమలదీధితులు శంఖములట్లు నమ్రలై
తనుఁ జుట్టుకొన్న సోదరుల వెంట

---

*ఆంధ్రపురాణము విద్యారణ్య పర్వమునుండి.

హరిహరుఁడు రాజహంసమై యల్లనల్ల
మానసానంద ఘనసరోమార్గమందుఁ
గలయనడచి గురుబ్రహ్మఁతలపువట్టి
శంకువునుబెట్టు మంగళస్థాన మరసె.

అయ్యెడ సమ్మోహీరమణునకు —

లంపులమారులై పెఱికళావిభవమ్ము సహింపనేరమిం
గొంపలుగూల్చునయ్యరులకుం దలఁకుంగొని యింతదాఁకఁ గ
న్పింపక నేలలోనడఁగి నిశ్చలసాధుతపస్సమాధిమై
సొంపులు దేఱువాస్తుపురుషుండు శుభాగమనమ్ముపల్కఁగన్.

హరిహరుం డాతనికరాగ్ర మందుకొన్న
చందమై మంగళారంభసమయమందుఁ
దనపురోహితవిప్రుఁ డిచ్చినది పట్టె
సఫలతాంబూలమును శుభాక్షతలనడుమ.

హరిహరరాయధరణీంద్రుండు ప్రాఙ్ముఖోపవిష్టుండైన పదంపడి పురోహితుండు గణాధిపతి పూజాకార్యము నిర్వర్తింపఁజేయుటయు శంకుసంస్థాపన సుముహూర్త సంకేతంబుగాఁ దోతెంచనగు శ్రీమన్మాధవాచార్య వదనాధ్మాయమాన శంఖారావమ్మునకు వారెల్లం జెవులువెట్టియుండ నా నిశ్శబ్ద ప్రభాతమ్మునఁ గతిపయక్షణంబులకు—

వినిపించె నొక్కకంబు
స్వన మంబరవీథి ఁమింగుచాయ ఘనంబై
విని, గురు సంకేతిత శం
ఖనినాదం బిది ముహూర్తకాలం బనుచున్.

హరిహరునిచే శంకువున్నిలుపఁజేయ సంభ్రమించుతఱిఁ బురోహితుం బరికించి శబ్దబ్రహ్మవిత్పాద శుశ్రూషాపరాయణుండగు బుక్కరాయ లది యాచార్యశంఖధ్వానంబుగాఁదనకు వినంబడమి నాఁగుం డని యమ్ముహూర్తంబు వారించి యాశ్చర్యఖిన్నుఁడైన తనయన్నతో నిట్లనియె—

అరయంగా గురుదేవశంఖరవ మన్నా! కాదు కాదిద్ది: య
త్యురు సంకల్ప పురస్సర ప్రణవసుష్పూచ్చారితోచ్చైర్ధ్వనా
ద రసబ్రహ్మములో నణుస్ఫురణమాత్రం బౌనె! యీధ్వాన; మె
వ్వరిదో ముష్టిరవంబు సంకు విది కావచ్చు న్నిరాశంకమై. . . .

అదియుంగాక యిది విరూపాక్షాలయమ్ము దెసనుండి పొడతెంచిన సవ్వడియుం గాదు; మఱియు నిందు లౌకికంబైన ఛాంకారవంబేకాని వైదికంబైన యోంకారనాదంబు వినరాలేదు ; కతిపయక్షణంబులకు మాధవ మధుర వదనపూరితంబై వచ్చు శంఖని స్వానంబునకు నిశ్శబ్దతనుండి నిరీక్షింత మనవుడు హరిహరుండు సరికానిమ్మనిఁయు నంతరాంతరమున మెదలు సంశయలేశమ్మున నట్లైయుండె; నంత

అలఘుమతిశాలి బుక్కరాయలపలుకుల
కచటివారలు మూఁగలై యరయుచుండ
నావు పాల్పిండునంత కాలాంతరమ్ము
నీరవత ప్రాంతమెల్ల నిండారునంత.

వినవచ్చెన్ ప్రణవామృతాబ్ధి విచలద్వీచీ సమీచీన నూ
తనశంఖారవధార యొక్కఁ డది తత్త్వశ్రీ గుబాళించు గొం
తున నేతెంచినదై యిదంప్రథమ మాధుర్యావధిం జూఅలి
చ్చిన నాతన్పు ముహూర్తకాలముగఁ డోఁచెన్ బుక్కభూజానికిన్.

తోఁచుటయు - నగ్రజునివంక జూచుటయును
హరిహరుఁడు శంకువుంచుట - యనెడిదెల్ల
జరిగె నొకసూదిమొనఁ దమ్మివిరిదళంబు
గాడినంతటి సుముహూర్తకాలమందు.



# పుస్తకసమీక్ష

## సింహబలి

పుటలు 122 వెల : రెండు రూపాయిలు

మోటూరి వెంకటరావు, బి. ఏ.

*ఎం. ఎస్. ఆర్. మూర్తి అండ్ కో., విశాఖపట్టణము.*

ఒక్కొక్క కాలంలో ఒక్కో విధమయిన కావ్యాల ఎద్దడి ఉంటుంది. ఖండకావ్య ప్రాచుర్యం ఏతత్కాలీన పద్ధతి. అందువల్ల ఈ కాలంలో వస్తు గ్రహణం చేసి కావ్యరచన సాగించడ మనేది ఒక విధంగా సాహస ప్రక్రియే. ఎందుకంటే, ఖండ కావ్య ప్రాచుర్య సందర్భంలో వస్తుగ్రహణం చేస్తే దానికి ఖండికాత్వం పట్టకుండా నిర్వహించడం కష్టం. ఖండిక స్వల్పపరిధి గల భావనా చమత్కృతి లోనే పర్యవసిత మవుతుంది. కాని వస్తువనేప్పటి కల్లా దాని ఎత్తుగడ, దింపుగడ, పాత్రచిత్రణ మొదలైన బోలెడు విషయాలు తటస్థపడతాయి... పద్యం అందంగా వ్రాయవచ్చు, మెరుగులు పెట్ట వచ్చు...లఘు చేయవచ్చు. కాని వస్తుకావ్యంలో వీటన్నిటిని మించి కథారస నిర్వహణం అనేది ప్రాధాన్యం వహిస్తుంది. కవి శక్తి ఈ వృశమయిన వస్తు నిర్వహణలోనే స్పష్ట మవుతుంది. ఈ శక్తి తక్కువయిన అనేకులు ఖండికాలబ్ధయశఃపరిశిష్టు లయ్యే ఉంటున్న సందర్భంలో 'సింహబలి' అనే ఈ వస్తుకావ్యం సహృదయుల చేతుల్లోకి వస్తున్నది.

'సింహబలి' చరిత్రాధార మయిన కావ్యం. ప్రఖ్యాతం ఇతివృత్తం. చరిత్రాధారంగా ఇదివరకు శివభారతం, రాణా ప్రతాపసింహ చరిత్ర, ఆంధ్ర పురాణం మొదలైన కావ్యాలు కొన్ని వచ్చినవి.

ఇక్కడ రెండు విషయా లున్నవి. చారిత్రక వాతావరణం కూర్చి కథా కల్పన చేయడం, చరిత్రనే కావ్యంగా వ్రాయడం. రెండవది కష్టతర మయింది...చరిత్రను చరిత్రగా చెప్పడానికి పద్య కావ్యం అనవసరం. ఆ పని అనేకాధారాలతో చారిత్రకులే చేస్తున్నారు. అందుకని 'ఆ' వస్తు కావ్యంలో ప్రాణభూతమైన విషయాన్ని - వస్తుగతమైనదాన్ని - గ్రహించి, దాన్ని విస్తరించడం అవసరం. అది ఈ 'సింహబలి' లో జరిగింది.

జిజయ తన కుమారుడైన శివాజీని పరహస్తగత సింహగడం సాధించిపెట్టమంటుంది. ఆ కోర్కెను శివాజీ ఆజ్ఞానుసారం తానాజీ పూర్తిచేశాడు. కాని చివరకు యుద్ధంలో మరణిస్తాడు. సింహం పోయింది, గడం మిగిలింది. సూక్ష్మంగా కథా వస్తు విది.

ఈ కథకంతకీ ప్రాణభూతమయిన విషయాలు దేశభక్తి, ఆత్మత్యాగం. చరిత్రలో చరిత్రగా కన్నా, కావ్యంలో వీటి ప్రాధాన్యం హెచ్చు. చరిత్రలో తథ్యతని నిరూపించడమే ముఖ్యం. కాని కావ్యంలో తదేక దేశఘట్ట గ్రహణంచేసి, తద్వారా మనః ప్రబోధం ముఖ్యం. ఈ విషయం విస్మృత మవుతే తత్కావ్యకర్మ విఫల మన్నట్లు. 'సింహబలి' అందులో సాఫల్యం పొందింది.

ఇతివృత్తం ప్రఖ్యాత మయినప్పుడు కథా కథనంలో ప్రత్యేకత చూపడం అవసరం. దానివల్ల కావ్యత్వం దీప్త మవుతుంది. చరిత్రలో మొత్తానికి నాయకుడు శివాజీయే అయినా, తదేకదేశమయిన ఈ ఘట్టానికి నాయకుడు తానాజీ. *జిజయతో కాకుండా కథ ప్రారంభం తానాజితో ఈ కావ్యంలో జరిగితే స్ఫూర్తి ఇంకా ఎక్కువగా ఉండేది.*

కథా గమనంలో, అక్కడక్కడా కుంటుదనం కొంత 'సింహబలి'లో కనిపిస్తుంది. సింహగడాన్ని సాధించమన్న జిజయతో శివాజి "—కదనపాండితి నా బాల్యకాలమందుఁ గలపినప్పుడె ప్రత్యనీక పటలిపయిఁ, బంచవిధయానములు నిర్వచించి యధమ మైనదంటినమ్మ ! ఉపేక్ష్యయానమందు. అందువల్ల ప్రస్తుతం సింహగడంమీదికి దండెత్తటం ఉపేక్ష్యయాన మవుతుంది. తద్వారా ప్రమాదం రావచ్చు. అందుకని అది ఇప్పుడు కుదరదు" అంటాడు. అయితే దీనికి జిజయనుండి సమాధానం లేదు. పైగా అతన్ని—పిరికివాడ వవుతున్నావనీ, వెనకాడుతున్నావనీ నిష్ఠురాలాడి, ఈ పని నీతరం

కాకుంటే నేనే నిర్వహిస్తా నంటుంది. ఇక్కడ శివాజీని ప్రోత్సాహ పరచడమనేది జిజయవల్ల జరిగినా, శివాజీకి సమాధానం లేకపోవటంవల్ల— జిజయకు స్వనీతి వ్యాఘాతం సంభవిస్తున్నది.

దీనివల్ల కథాగమనంలో శైథిల్యం వస్తున్నది... ఉపేక్ష్యయానం కొన్ని కొన్ని సందర్భాలల్లో అపేక్షణీయం అనో, కాక 'ఇది' ఉపేక్ష్యయానం కాదనో, నిరూపించవలసి ఉండింది,... ఇంకోటి. జిజయ మాటలవల్ల తానాజీ అనే వీరుడున్నాడనేది కూడా ఆమెకు తెలియదనిపిస్తుంది. కాని ద్వితీయ ఖండంలో తానాజీ జిజయలకు పుత్ర మాతృ ప్రేమ సంబంధం ఉన్నట్టు వ్యక్తీకరించబడుతుంది. అందువల్ల ఆ ఘనిష్ఠ సంబంధం ప్రథమ ఖండంలో 'నీతరంకాకుంటే' అన్నప్పుడైనా సూచ్యమవుతే బావుండేది. అల్లా కాకుంటం మూలంగా, తరువాత నెరపిన ఆ సంబంధం-ఊరికే సింహగడాన్ని సాధించడంకోసమే జిజయాదులు కృత్రిమంగా నెరపినట్లు భావ్యమవుతుంది. మరో చోట- తానాజీ మరణానంతరం- శివాజీ సింహగడానికి వచ్చినప్పుడు (అప్పటికి తానాజీ మరణం అతనికి తెలియదు.) శివాజీ మినహా వీరు లందరూ అతనికి స్వాగతి నెరపుతారు. ఆ సందర్భంలో- ఆ వీరుల ముఖాల్లో విజయసంబంధి శోభతప్ప, తానాజీ మరణసంబంధి విషాదం ఏమాత్రమూ సూచ్యం కాదు. ఇది తానాజీ పట్ల ఆ వీరుల భావాన్ని గూర్చి అన్యాయమే అవుతుంది. ఆ వీరుల ముఖాల్లో విజయ విషాదభావ సమ్మిశ్రణం వ్యక్తం చేయబడి, తద్ద్వారా శివాజీకి ఆశంకాపాదనం స్ఫూర్తిని కలిగించేది కావ్యానికి.

అయితే, ఇల్లాంటి అక్కడక్కడి లోపాలను రచనా శిల్పం క్రమ్మివేస్తున్నదీ కావ్యంలో. పద్య గమనం, భావస్ఫూర్తికనుగుణంగా, వాటివిరుపులూ పుష్కలంగా ఉన్నాయి. ముఖ్యరసమయిన వీరం. రౌద్రాన్ని అంగంగా తీసికొని అడుగడుగునా పొంగి పొరలుతూ ఉంటుంది. లలితలలితమైన శైలికి మాత్రమే అలవాటయిన వారినీ 'సింహబలి' శైలి వ్యగ్రులను చేస్తుంది. శైలి ఎప్పుడూ భావానుబంధి కావడమే ఉత్తమం, కాని ప్రతివిధమయిన భావమూ ఏకవిధ శైలిలోనే 1క్షిప్తం కావడం అనుత్తమమే అవుతుంది. ఇదే ఎక్కువగా జరుగుతున్న ఈ కాలంలో, దాన్నెదుర్కొని 'సింహబలి' లో సమర్థంగా భావానుబంధిశైలి నిర్వహింపబడింది.

ఈ కావ్యంలో రెండు ప్రయోగాలు చేయబడినవి. ఒకటి కథాగమన సంబంధి, మరొకటి భాషా సంబంధి. ప్రతి ఖండాంతంలోనూ సూర్య వర్ణనం- రెండు ఖండాతాల్లో మాత్రం వర్షా వర్ణనం- చేయడం జరిగింది. దీనివల్ల కథ ఎక్కడికక్కడ సుష్ఠుగా నిబద్ధమయినట్లు స్ఫూర్తి కలుగుతుంది. తత్ఖండగత వస్తువిషయానికీ, తదంత వర్ణన సూచిక అవుతుంది. ఈ ప్రయోగాన్ని ప్రప్రథమంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ 'ఝాన్సీరాణి' లో ఋతువర్ణనాత్మకంగా ప్రవేశపెట్టినారు. అది ఈ కావ్యానికి ఆధారమయి ఉంటుంది.

ఇక రెండవది భాషా విషయం. ఇంత చిన్న పరిధిలో, ఇంత విస్తృతంగా క్రొత్త పదాలను, వ్యవహారదూరమైనవానిని మరెవరూ ఉపయోగించ లేదనవచ్చు. అయితే ఈ పదాలపైని అతిశయితమయిన మోజు- పఠనలో బాధాకరమే అవుతున్నది. కావాలని పదాలన్నిటినీ ఒక పట్టిక వేసుకొని ఉపయోగించినట్టు వెంటనే స్ఫురిస్తుంది. ఎందుకంటే ప్రతి పద్యంలోనూ అర్థంకాని పదాలు కనీసం రెండైనా ఉంటాయి. (పుస్తకం చివర అర్థాలిచ్చారు కవి. కాబట్టి వెంటనే చూచుకోవచ్చు.) మరొకటి- అక్కడక్కడ వ్యవహారంలో ఒక అర్థమందు రూఢంగా ఉన్న పదాలను- వ్యుత్పత్త్యర్థంలోనో, మారార్థంలోనో ఉపయోగించడం జరిగింది, ఉదాహరణకు- ఉద్యానము, గండూషము మొదలైనవి. వీటి వ్యవహారార్థం, తోట, పుక్కి-

లించుట. కాని నెమళ్ళు, క్రౌంచము యొక్క చివర అనే అర్థాలలో అవి ఉపయుక్తమైనవి. ఈవిధంగానే 'స్త్రీఘోషము' అన్న పదానికి 'బాలఘోష' అన్న పదానికి బాలల ఏడ్పు అన్నట్లు, స్త్రీల ఏడ్పు అని వెంటనే స్ఫురిస్తుంది. కాని 'ప్రభాతం' అనే అర్థంలో అది ప్రయుక్త మయింది. పద్యస్ఫూర్తిని తొలిగించ పూనుకొనే ఇట్లాంటి పద ప్రయోగాలు చాలా తికమకలు పెడతాయి. ఇంత 'ఇది' లేకుండా ఉంటే- ఆ నూత్న పదాలవల్ల కలిగిన వింత శోభ పూర్ణమయ్యేది.

మరుగుబడుతున్న పూర్వ శౌర్యాన్ని పునః సంధుక్షితం చేసే యత్నంలో చాలావరకు కృతకృత్యమవుతున్న ఈ కావ్యం, కావ్యశిల్పదృష్ట్యా కూడా సాహిత్యకులందరికీ ఉపాదేయమవుతున్నది.

— 'సంపత్కుమార'

## మధూలిక

వెల: రూపాయిన్నర

దుర్గానంద్

శిక్షక్ పబ్లిషర్సు, తెనాలి.

ఆధునిక తెలుగు కవిత్వంలో అభ్యుదయ కవితా ఉద్యమం కొద్ది రోజులుగా తన పాతస్వరూపాల్ని విడిచిపెట్టేసి కొత్త స్వరూపాల్ని ధరిస్తున్నది. వస్త్వాశ్రయములు కాకుండ భావాశ్రయములైన ఖండ కావ్యాల రచన ఆగింది. ఆ ప్రయత్నంలో వస్తువు గ్రహించి ప్రాచీనచ్ఛందస్సులో రచన చేశారు దుర్గానంద్.

దీన్ని అభ్యుదయ ప్రబంధం అన్నారు రచయిత. "శ్రేయమును అభ్యుదయ కవిగా. ప్రేయమును భావకవిగా వర్ణించి ఈ రెండు తత్త్వాలను కలుపుతూ విడదీస్తూ కథను ముందుకు జరిపా"నని దుర్గానందే అన్నారు అర్థోక్తిలో. అందుచేత ఈ వస్తువు భూత కాలానికి చెందినా అభ్యుదయమే. అంతకుపూర్వమే విద్వాన్ విశ్వంగారు "పెన్నేటిపాట"ను కావ్యంగా నిర్వహించారు కాని, దాని వస్తువు ఆధునికమైంది.

మౌర్యరాజుల అనంతరం చిన్నచిన్న రాజ్యాలు పర్వృష్టకాలాన మగధ రాజ్యంమీద కోసలరాజ్యం దండెత్తడం ఈ కావ్యప్రధాన విషయం. దీనికి బీజం మన్మథోత్సవాలలో రిక్తపాత్రనిచ్చి కోసల రాజకుమారుని మగధ రాజపుత్రి కికురించడం. అవమానితుడైన రాజకుమారుడు అశ్వారూఢుడై పరుగెత్తుతూ శిరిపల్లెదగ్గర గుట్టనుంచి జారిపడతాడు. సహాయం చేస్తూ ఆ ఊరి బాలిక మధూలిక ఆయన తల ఒడిలో చేర్చుకుంటుంది. ఆమె అతని యందనురక్తయై ముద్దుపెట్టుకుంటుంది. ఆశ్వికుడు బిరబిరా వెళ్ళిపోతాడు. శిరిపల్లె మగధ రాజ్యపు యుద్ధక్షేత్రమౌతుంది. పల్లెజనం కాందిశీకులౌతారు మధూలికకూడా ఒంటరియై ఓ నావదాటి కోసల రాజ్యంలో చేరుతుంది. అచ్చట ఒక వేగుజామున ఒక పావురంతో తన అవస్థ చెప్పుతుంది. ఇదివింటూ ఉన్న రాజకుమారుడు వచ్చి పశ్చాత్తప్తుడై యుద్ధాన్ని మానేసి మగధ రాజ్యంతో సంధి చేసుకుంటాడు. ఇది ఈ కావ్యంలోకథ.

ఐదాశ్వాసాలతో, ఐదు వందల పద్యాలతో సంప్రదాయ చ్ఛందస్సులో ఆధునిక అభివ్యక్తీకరణలతో ప్రతిభాపూర్ణుడైన ఈ కవి నిర్వహించాడు. ప్రతి పద్యాన్ని జాగ్రత్తగా మలచే కోరిక ఈ కావ్యంలో అడుగడుగునా గోచరిస్తున్నది. నూతనములైన రూపకోపమానములు ఆహ్లాదకరంగా ఉన్నవి. మధూలిక మగధ సేనానితో మాట్లాడిన ఘట్టం ఈ కావ్యంలో మకుటాయమానంగా ఉన్నది. "శ్రమమోర్వసీ పరిష్వంగ సుఖాత్ములు," "ధాన్య రమలేని పల్లెనిస్త్రాణియయ్యె" "భంగపడినట్టినిండు యౌవనమువోలె". "గగనమున నెక్కి మేటి విల్లాడెవండో" "ఎలుపుకొండలచెవి నెక్కుపెట్టివిసరెనో యేమొ బాణము కసరికసరి, వీచుచుండెను పెను గాలి వీథివీథి", "నిడుద పెన్నేటికురులు నెన్నడుము మీద సరస చిక్కణ మృదుసమానములు సుమ్ము"

"విద్యుకత్తి విసరివేసిన యట్టులు" మొదలైన ఊహాల ఔన్నత్యము కావ్యంలో ఎక్కువగా గోచరిస్తున్నది.

ఈ కావ్యంలో కవి వస్తు నిర్వహణలో తన పాత్ర ఎక్కువగా ఉంచుకొన్నట్లు గోచరిస్తున్నది. ఆత్మాశ్రయాలైన ఖండ కావ్యాలలో లాగ ఈ కావ్యంలోనూ పల్లెలపై, కాందిశీకులపై ఇలా ఎన్నో విషయాలపై కవి తానుగా తన జాలినీ, ప్రేమనూ వ్యక్తీకరిస్తాడు. పాత్రలను వదిలేసి కవి తానుగా కావ్యంలో ప్రవేశించినప్పుడు కావ్యానుభూతి దశలో దెబ్బకలుగుతుంది. ఇదే ఒక కాలం నాటి పాత్రలచేత ఇంకో కాలంలో ప్రచురములైన భావాలను విరివిగా చెప్పినప్పుడు కూడా కలుగుతుంది. ఈ కావ్యంలో యుద్ధాన్ని ద్వేషించే పల్లెవాళ్ళ మాటలు, మధూలిక చిట్టచివరి సందేశమూ, ఇలా చాల చోట్ల ఉన్న దీర్ఘోపన్యాసాలు ఈ కాలం నాటి కావ్యంలో ఉండదగినట్లుగా ఉన్నవి. తన ఊహాలను వెల్లడించే తొందరలో కవి పాత్రలను దిద్ది తీర్చే విషయంలో శ్రద్ధవహించలేదు.

ఈ వస్తు నిర్వహణసంబంధిదోషం చాలమంది గొప్పవాళ్లకే తప్పలేదు. కాని దుర్గానంద్ ఈ విషయంలో జాగ్రత్తవహిస్తే చాల గొప్పకృతులు నిర్మించవచ్చు.

పుంశ్చలీత్యాది శబ్దాలు వాడటం బావుండలేదు. "ఏబది రవి చంద్రులున్ వెలుగు బాహువులన్ నిగిడించి నీలవారిదములవోలె కాంచన పరిమళముల్ గురిపింతు రెల్లెడన్" మొదలైన చోట్లలో పద్యాలు అర్థం కావడంలేదు.

—సుప్రసన్న

## తెలంగాణా

వెల ఒక రూపాయి

శ్రీ ఇందుకూరి సత్యనారాయణరాజు

ప్రకాశకు :

*అజంతా పబ్లికేషన్సు, సికింద్రాబాదు.*

ఆంధ్ర ప్రదేశ్ లోని తెలంగాణా జిల్లాలు తొమ్మిదింటిని గూర్చిన (ఖమ్మం, వరంగల్లు, కరీంనగరం, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదక్, హైద్రాబాదు, మహబూబునగరం, నల్లగొండ) వివరములతో నున్న గ్రంథ మిది. ప్రతి జిల్లా యొక్క సరిహద్దులు, వైశాల్యము, జనాభా; తాలూకాలు - గ్రామాలు మొదలైన లెక్కసరి వివరాలతోపాటచటి శీతోష్ణ పరిస్థితులు - పంటలు, ఖనిజ సంపద, ప్రాజెక్టులు; ప్రసిద్ధములైన పట్టణాల పూర్వ చరిత్ర - ప్రస్తుత మచటి విద్యాభివృద్ధి - మొదలైనవి సంక్షిప్తముగను స్థూలదృష్టికి సమగ్రముగను ఈ గ్రంథమున వ్రాయబడినవి. తెలంగాణా యొక్క భౌతికములైన స్వరూపస్వభావాలు ఈ గ్రంథము వల్ల తెలియగలవు. కొంత దేశము యొక్క జ్ఞానము కావలయు ననుకొను వారికీ గ్రంథ ముపయోగ పడగలదు.

## విజ్ఞాన వ్యాసములు

రచన :

శ్రీ కె. యస్. గోపాలమూర్తి,

*అధ్యాపకులు, హిందూ కాలేజి, గుంటూరు.*

ప్రచురణ :

*బుక్ ఎంటర్ ప్రైజెస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2*

ఉన్నత పాఠశాల - కళాశాల విద్యార్థులకు వ్యాస రచనయందు చొరవగలుగుటకు గాను వ్రాయబడిన నమూనా వ్యాసముల సంపుటి యిది. సారస్వత, వైజ్ఞానిక - ప్రాదేశిక - సాంఘిక - మత - కళ - ఆర్థిక విషయములకు సంబంధించిన మొత్తము నలభైయైదు వ్యాసము లిందున్నవి. వ్యాసరచనకు సూత్రములని ప్రత్యేకముగా ముందొక వ్యాసమును నున్నది. ఈ రకము గ్రంథములు ఆంగ్లభాషలో మన దేశమువారు వ్రాసినవియు - అన్యదేశీయులు వ్రాసినవియు చాల ఉన్నవి గాని తెలుగులో లేవు. ఉన్నను చాల కొద్ది. అట్టి పరిస్థితిలో విద్యార్థుల ఉపయోగము కొరకు శ్రీ కె. యస్. వి. గోపాలమూర్తిగారి

ప్రయత్నము చేయుట మెచ్చదగినది. ఇట్టి పుస్తకములను ప్రచురించువారును ప్రశంసార్హులు. ఈ గ్రంథము వంటి గ్రంథము లింకను రావలయును. విద్యాధికారులు గమనించి వీటిని విద్యార్థుల కుపయోగపడునట్లు చూచుట లెస్స.

## దేవీనవతి

రచన

శ్రీ మధునాపంతుల సూరయ్యశాస్త్రి

ప్రతులకు : రచయిత

పల్లిపాలెము (Via) యానాం

మూక పంచశతిలోని శ్లోకనవతి కనువాద మీ గ్రంథము. పారాయణ క్రమములో యథామతి నప్పుడప్పుడు అనువదించిన పద్యము లివ్వియని గ్రంథకర్తయే చెప్పుకొనెను. ఇందులో పదపద్మము-చిఱునవ్వు-కటాక్షము - కొలువు - ఆనందకందము-అన్న శీర్షికలతో, ఒక్కొక్కదానియందు పదునెనిమిది చొప్పున పద్యము లున్నవి. అమ్మవారి పదపద్మములను-చిఱునవ్వును-కటాక్షమును పరిపరి విధముల భావనచేసి స్తుతించి, కాంచీపురమున కొలువున్న ఆ యమ్మవారిని హృదయమున స్థిరపరచుకొని జీవుడే ఆనందించుట క్రమముగా చెప్పబడినది. ఇది అనువాదము గనుక భావన విషయమున ఏమి చెప్పినను మూలమును గురించియే చెప్పుట యగును. ఇక పద్యరచన తెలుగున పద్యము ధారాళముగా వ్రాయలేని కవులు మన దేశమున చాల అరుదు, సూరయ్యశాస్త్రిగారు ఉత్తమ తరగతిలోని పద్యరచయితలు. పదసంయోజన సమాస సంఘటన ఇత్యాదులు రమణీయములు. పద్యరచనలోని మెలకువ తెలిసినవారు శాస్త్రిగారు.

"మూఢ మానవ మమతాభిమోక్షణములు
శక్రమణి దీప్తి శిక్షావిచక్షణములు
రమ్యలోకత్రయీ రాజ్య రక్షణములు
తల్లి చూపులు వరదాన దక్షిణములు."

ఇది గీతపద్యము. పాదాంతయమకమువలన పద్యమున కొక ముక్తాయింపువంటి సొగసు వచ్చును. గీతముయొక్క పరిధియే కొద్ది యగుట వల్లను, అందును నాలుగు పాదాంతములయందా యమక ముండుటవల్లను ఆ సొగసు కొట్టవచ్చినట్లు కనిపించును. పద్యరచన దానికదిగా నొక ప్రత్యేక విద్య—అమ్మవారి యందలి పరమమైన భక్తిభావముతో వ్రాయబడిన పద్యములు గనుక ఆస్తిక్యబుద్ధి గలవారు పఠింపదగినవి. పారాయణము చేయదగినవి. ఈ అనువాదము చూచిన తరువాత సూరయ్యశాస్త్రిగారు మొత్తము మూక పంచశతి అనువదించిన బాగుండు ననిపించుచున్నది.